అట్లుగాక మరికొంతకాలము చూచి పాకీస్తాన్ ప్రవర్తనను గమనించి అప్పుడిట్టిచర్యను తీసికొనిన సమర్థనీయముగ నుండెడిది.

మంత్రివర్గమునందలి బెంగాల్ సభ్యు లిరువురును రాజీనామా నిచ్చుటవలన పశ్చిమ బెంగాల్ ప్రజల యందు ఒడంబడికపట్ల ప్రాతికూల్య మేర్పడుట సహజము. ఈ ప్రాతికూల్యము ఢిల్లీ ఒడంబడికను అమలుజరుపుటకు ప్రతిబంధకము కాగలదు. ఈ దృష్ట్యా ముఖర్జీ, నియోగిగార్ల రాజీనామా పరిస్థితులను చక్కబరచుటకు గాక క్లిష్టమొనర్చుటకే ఉపయోగపడును.

ప్రస్తుత క్లిష్టసమయమున అన్నివర్గములవారు ఐకమత్యముతో ప్రభుత్వవిధానమును సమర్థించుచు, ప్రభుత్వమును బలబరచుచుండుట అవసరము. ముఖ్యముగ బెంగాల్ నందలి వివిధవర్గముల సమైక్యత అత్యంతావశ్యకము. డాక్టర్ ముఖర్జీ, నియోగీగార్లు ఇందుకు కృషి చేయుదురుగాక.

## కమ్యూనిస్టు ప్రచారం: ట్రూమన్ సూచన

కమ్యూనిజమును, కమ్యూనిస్టుప్రచారమును ఎదుర్కొనుట ఒక ప్రపంచసమస్య యైనది. కమ్యూనిజమువ్యాప్తికి రష్యా ప్రయోగించుచున్న అస్త్రము ప్రచారమే. ద్వితీయసంగ్రామకాలమందు, అంతకు పూర్వము నాజీజర్మనీ ఉపయోగించిన అస్త్రముకూడ ప్రచారమే. ప్రజలకు యథార్థస్థితి తెలిసి ఈ ప్రచారము నందలి సత్యమును గ్రహించువరకు నాజీప్రచారము ఫలించెను. జపాన్ కూడ ఆ సాధనమునే బ్రిటన్, అమెరికాలపై ప్రాచ్యదేశములందు ద్వేషమును కల్గించుటకు వినియోగించెను.

సత్యమును మరుగుపరచియుంచుట ఎవరికిని సాధ్యముగాదు. కాని ఆ సత్యమును అందరు గ్రహింప కలుగునట్లు చేయుట అంత సులభము గాదు. అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ తెలిపినట్లు కమ్యూనిస్టుప్రచారమునందలి సత్యాసత్యములను ప్రజలు గ్రహింప కలుగునట్లు చేసిన కమ్యూనిజమును ప్రతిఘటించుట సులభమగును. ప్రస్తుతము సోవియట్ రష్యాయందున్నది యథార్థముగ కమ్యూనిస్టువ్యవస్థ అవునా కాదా యను విషయమున నే సత్యము వెల్లడికాలేదు. "స్టేట్ కాపిటలిజము" కమ్యూనిజము కానేరదు. కనుకనే భారతప్రధానమంత్రి కమ్యూనిస్టుసిద్ధాంతమునకు తమకు ఎట్టి అభ్యంతరము లేదని అనేక పర్యాయములు ప్రకటించిరి. కాని కమ్యూజము పేర నేడు భారతకమ్యూనిస్టులు అనుసరించుచున్న విధానమునుగాని, రష్యాయందు అమలుజరుగుచున్న పద్ధతులనుగాని తాము హర్షింపలేకుంటి మనిరి.

కమ్యూనిస్టుపక్షములకు ప్రధానమైనది మార్గము గాని, గమ్యస్థానము గాదు. ప్రభుత్వవిరహిత సామాజికవ్యవస్థనిర్మాణమే కమ్యూనిజం. అది అరాచకవ్యవస్థ కాదని కూడ కమ్యూనిస్టుసిద్ధాంత ప్రవక్తలు స్పష్టముచేసియుండిరి. నేడు వివిధదేశములందలి కమ్యూనిస్టుపక్షములు దౌర్జన్యచర్యలద్వారా అరాచకమును ప్రోత్సహించి తమ 'లక్ష్యము'ను సాధించుకొన దలచిరి. ఇట్టి విధానములు వాస్తవమైన ప్రభుత్వవిరహిత సామాజికవ్యవస్థస్థాపనకు ఎంతమాత్రము ఉపయోగపడజాలవు. సమతాధర్మముపై పరిపాలనాయంత్ర మవసరము లేని, సామాజికవ్యవస్థ స్థాపనమే కమ్యూనిస్టుల లక్ష్యమైన, ఇట్టి అరాచక చర్యలకుగాని, దౌర్జన్యపద్ధతులకు గాని ఆస్కారము లేదు.

సోవియట్ రష్యాలో ప్రస్తుతము అమలునందున్న ఆర్థికసాంఘికవ్యవస్థను స్థాపించుకే భారత కమ్యూనిస్టుపక్షలక్ష్యమైన, అందలి లోపములను వదలి, భారతదేశపరిస్థితులకు తగినట్టి సామాజికవ్యవస్థను (స్టేట్ కాపిటలిజం) స్థాపించుటకె నెహ్రూప్రభుత్వము ప్రయత్నించుచున్నది. బ్రిటన్‌లో అట్లీప్రభుత్వము, అమెరికాలో ట్రూమన్‌ప్రభుత్వముకూడ ప్రధాన కీలకపరిశ్రమలను జాతీయముచేయుటద్వారా 'స్టేట్ కాపిటలిజం'ను సాధించుటకే ప్రయత్నించుచుండెను. అయినను ఈ దేశము లన్నింటియందు కమ్యూనిస్టులు 'విధ్వంసకచర్యల'ను కొనసాగించుచునే యుండిరి.

సోవియట్ రష్యాకుగాని, కమ్యూనిస్టుపక్షములకుగాని ప్రపంచమందంతట యథార్థమైన ప్రజాప్రభుత్వము లేర్పడుటే అభిమతమైయుండిన "ప్రజాస్వామిక

ములను పడద్రోయుటకు గాక వాటిని బలపరచుటకే ప్రయత్నింపవలసియుండును." రష్యాకు కావలసినది ప్రజాస్వామికప్రపంచవ్యవస్థ గాదని, ప్రతిదేశము నందును తమ ఆదేశముల శిరసావహించు ప్రభుత్వములు ఏర్పడుటే యని యుగస్లావియా సంఘటన ఋజువు చేయుచున్నది. మార్షల్ టిటో తన దేశ సాంఘిక, ఆర్థిక పరిస్థితులను బట్టి నూతనఆర్థికవ్యవస్థను నిర్మింపదలచెను. అది రష్యాల పేక్షలకు విరుద్ధమయ్యెను. కనుక రష్యా యుగస్లావియాను కమ్యూనిస్టుకూటమినుండి బహిష్కరించెను.

సోవియట్ రష్యా, క్రెమ్లిన్ ఆదేశముల ననుసరించి వివిధదేశములందు విధ్వంసకచర్యలను కొనసాగిస్తున్న కమ్యూనిస్టుపక్షముల అసలుఉద్దేశ్యము ప్రపంచాధిపత్య మనుటకు సందేహము లేదు. ఆ సంకల్పమును కప్పిపుచ్చుటకు వారు చేయు నినాదముల ఆంతర్యమును ప్రజలు గ్రహింపకలిగిననాడు, ప్రజాస్వామికవ్యవస్థే తరణోపాయమని వారు గ్రహింపకలిగిననాడు నినాదములుగాని, వీరి ప్రచారముగాని ప్రజలను మభ్యపెట్టజాలవు. ప్రజలా సత్యమును గ్రహించునట్లు చేయుటకే ప్రజాస్వామికరాజ్యము లన్నియు సమష్టి ప్రయత్నము చేయవలసియున్నది.

## భారత-పాకిస్తాన్ వాణిజ్యఒడంబడిక

"నెహ్రూ-లియాఖత్ ఆలీ" ఒప్పందము ఫలితముగ పాకిస్తాన్, భారతదేశములందు కలిగిన మార్పులను ఉభయదేశములమధ్య ఏర్పడినఆర్థిక, వ్యాపారసమస్యల పరిష్కారమునకు వినియోగించుకొనుటవలన ఉభయదేశములకు వాణిజ్యవిషయమై ఒక తాత్కాలికఒడంబడిక కుదిరెను. ఉభయ ప్రభుత్వములు ఇదే ధోరణిలో వ్యవహరించిన అన్ని సమస్యలు పరిష్కారమై స్థిరమైన ఒడంబడిక కుదరగలదు.

ఈ తాత్కాలికఒడంబడిక సమానవిలువగల వస్తువుల మారకమునకు మాత్రమె సంబంధించియున్నందున ఏ దేశమునకు నష్టము లేదు. పాకిస్తాన్ ఎనిమిదిలక్షల జనపనారబేళ్ళను భారతదేశమునకు సప్లయి చేయవలెను. అందుకు ప్రతిఫలముగ భారతదేశము నూలువస్త్రములు, తయారైన జనపనార సరుకు మున్నగువాటిని సప్లయి చేయవలసియుండును.

జనపనారవిషయమై పాకిస్తాన్ అనుసరించిన విధానమునకు అధిక్షేపణ తెలుపు నిమిత్తము భారతదేశము పాకిస్తానుకు బొగ్గుఎగుమతిని నిలుపుచేసెను. ఈఒడంబడికఫలితముగ ఆ పూర్వనిర్ణయమును ఉపసంహరించుకొనవలసిన అగత్యము లేదు. కాని కరాచీసంప్రదింపులందు పాల్గొన్న భారతప్రతినిధివర్గ నాయకుడు శ్రీ సి. సి. దేశాయిగారు ప్రకటించినట్లు వ్యాపారప్రతిష్టంభన కొంతవరకు పరిష్కారమగుటకు ఈ ఒడంబడిక తోడ్పడుచున్నది గనుక ఆ ప్రతిష్టంభనమును పూర్తిగా తొలగించుటకు, ఇకమీదట జరుగు ప్రయత్నములు ఫలప్రదమగుటకు అవకాశ మేర్పడినది. ఈ వ్యాపార, ఆర్థికసమస్యలు పరిష్కారమైన ఇతర రాజకీయసమస్యల పరిష్కారము కూడ సులభము కాగలవు.

---

## విషయానుక్రమణిక
## 26 ఏప్రెల్ 1950

# మనదేశం



డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ

## బెంగాల్ సమస్య *

"ఇండో-పాకిస్తాన్ ఒడంబడికకు అంగీకరించినవారి సదాశయాన్ని నేను అధిక్షేపించడంలేదు కాని ఒడంబడికను పాటించేవారు ఒక్కరే కాకూడదు ఒడంబడికే సక్రమంగా నిర్వహించబడి ఫలవంతమైనట్లయితే నాకంటె ఎవరూ అధికంగా ఆనందించరు కాని విఫలమైతే తీరని నష్టం వాటిల్లగలదు ఒడంబడికను విశ్వసించేవారికి నాదొక్కటే మనవి భార్యాపుత్రి కలతో అక్కచెల్లెళ్లతో సహా తూర్పు బెంగాల్ నివాసానికి వెళ్లి దురదృష్టవంతులైన అక్కడి హిందువుల కష్టసుఖాలలో పాలుపంచుకుని కర్తవ్యం నిర్వహించండని పరీ మనవి అదే వారి విశ్వాసానికి తగిన పాత్రు"అని డా॥ శ్యామప్రసాద ముఖర్జీ పార్లమెంటులో అన్నారు బెంగాల్ సమస్యసందర్భంలో భారతప్రభుత్వం అనుసరించిన విధానానికి సమ్మతించజాలక డా॥ ముఖర్జీ కేంద్రమంత్రివర్గంనుంచి రాజీనామా ఇచ్చారు రాజీనామా ఇవ్వడానికి తగు హేతువును వివరిస్తూ వారు పార్లమెంటులో దీర్ఘోపన్యాస మిచ్చారు

పాకిస్తాన్‌లో అల్పసంఖ్యాకులైన హిందువులు ప్రాణభీతిలేకుండా నివసించగలరా అనేదే ప్రధానసమస్య. ఈదృష్టితో ఇండో-పాకిస్తాన్ ఒడంబడికను పరీక్షిస్తే అంతగా ప్రయోజనం ఉండదని డా॥ ముఖర్జీగారి అభిప్రాయం. పాకిస్తాన్ రాజ్యాంగ పరిషత్సభలో వారి రాజ్యాంగాశయవివరణను జ్ఞప్తికి తెచ్చారు. ఇస్లామిక్ సాంఘిక వ్యవస్థాస్థాపనే ప్రధాన లక్ష్యంగాగల పాకిస్తాన్ రాజ్యాంగంలో హిందువులకు గౌరవమైన జీవనానికి తావుండదు. కాబట్టి పాకిస్తాన్ ఎన్ని ఒడంబడికలు చేసుకున్నా అల్పసంఖ్యాకుల సమస్య సులువుగా పరిష్కారం కాదనే అభిప్రాయాన్ని డా॥ ముఖర్జీగారు ప్రకటించారు.

బెంగాల్ విభజించబడి రెండు ఖండాలు రెండు భిన్నప్రభుత్వాల పరిపాలనక్రిందికి



సర్దార్ పటేల్

వచ్చినప్పటికి, తూర్పు బెంగాల్లోని హిందువుల రక్షణపట్ల భారత రిపబ్లిక్ బాధ్యత పోతే దన్నారు అల్పసంఖ్యాకులను రక్షించగలరనే వాగ్దానంపైనే దేశవిభజనకు కాంగ్రెస్ నాయకులు అంగీకరించారు. కాని ఇంతవరకూ అటువంటిరక్షణ తూర్పు బెంగాల్ హిందువులకు పాకిస్తాన్ ప్రభుత్వంవల్లగాని, భారతప్రభుత్వంవల్లగాని లభించలేదు. పోగా ఈనాడు తిరిగి పాకిస్తాన్‌తో మరొక ఒడంబడిక చేసుకొని తిరిగి హిందువుల్ని తూర్పు పాకిస్తాన్లోనే ఉండిపోవలసిందనీ, సంరక్షణకోసం వారు పాకిస్తాన్ ప్రభుత్వంపైనే ఆధారపడి ఉండాలనీ భారతప్రభుత్వం చెప్తోంది



శ్రీ కె. సి. నియోగి

బెంగాల్ సమస్యసందర్భంలో పశ్చిమ బెంగాల్ పట్ల భారతప్రభుత్వం వహించిన వైఖరిని డా॥ ముఖర్జీ విమర్శించారు పాకిస్తాన్‌లో దురంతరాలు జరుగుతుండగా భారతప్రభుత్వం సమాచారాన్ని ప్రకటించడానికి భీతి చెందుతోంది ప్రకటించడం వల్ల భారతదేశంలో కల్లోలం సంభవించగలదని భారతప్రభుత్వం అభిప్రాయం కాని పాకిస్తాన్ కల్లోలాలకు భీతి చెందడం లేదు భారతదేశంలో ముస్లింలనుగురించి అభూత కల్పనలుచేసి తీవ్రంగా ప్రచారంచేసి, పాకిస్తాన్‌లో హిందువులపై దౌర్జన్యాల్ని పురిగొల్పడంలో తోడ్పడుతున్నది దీనివల్ల సత్యం వ్యక్తం కావడంలేదు విదేశాలలో భారతదేశంలో హిందువులు కూడా రాక్షసకృత్యాలకు దిగుతున్నట్లు జరుగుతున్న దుష్ప్రచారానికి భారతప్రభుత్వం తలవంచవలసి వస్తోంది.

పశ్చిమబెంగాల్లో కలహాలు హత్యలు సంభవించడానికి ప్రజలు దోషులుకారని డా॥ ముఖర్జీగారి అభిప్రాయం తూర్పు బెంగాల్లో తమ బంధుమిత్రులపై జరుగుతున్న అత్యాచారాలకు ఆవేశం వచ్చినా పశ్చిమబెంగాల్ హిందువులు చాలరోజులు ఊరుకున్నారు భారతప్రభుత్వం సకాలంలో చర్యతీసుకుని పాకిస్తాన్‌లోని హిందువుల్ని కాపాడగలరని నా

రాశించారు. కాని ఎన్నివారాలు గడిచినా భారతప్రభుత్వం నిస్సహాయుంగా ఉండిపోయేసరికి ప్రజల సహనం హద్దుమీరింది. ఇంక తామే చర్యకు దిగవలసిన అవసరం కలిగిందని ప్రజలనుకున్నారు. ప్రభుత్వమే మొదట పరిష్కారమార్గం చూపగలిగినట్లయితే, ప్రజలీరీతిగా స్వతంత్రించి వ్యవహరించేవారు కారు. ప్రభుత్వానికి అండగా నిలిచేవారే. కాబట్టి ఈ ఒడంబడిక తమకు సమ్మతంకాదని డా॥ ముఖర్జీ అన్నారు. వీరితోపాటు రెండో బెంగాలీమంత్రి శ్రీ కె. సి. నియోగిగారుకూడా రాజీనామానిచ్చారు. వీరిని రాజీనామా ఇవ్వవద్దని ప్రధాని నెహ్రూ, ఉపప్రధాని సర్దార్ పటేల్ గార్లు ఎంత కోరినా వినలేదు.

అనంతరం సర్దార్ పటేల్ కలకత్తాలో అయిదురోజులు మంత్రులు, ప్రభుత్వోద్యోగులు, నాయకులతో సంప్రదింపులు జరిపారు. ఆఖరుదినం రేడియోలో, ప్రసంగిస్తూ, ఒడంబడిక మంచిదైనా చెడ్డదైనా అది తప్ప ఇప్పుడు అన్యమార్గంలేదని చెప్పారు.

"గతాన్ని గురించి నిస్పృహచెందడంలోనూ భవిష్యత్తును గురించి నిరాశచెందడంలోనూ నేనూ అధికుణ్ణే. ఇటువంటి ఒడంబడికలు సక్రమంగా అమలు జరుగుతాయని నేను అట్టే ఆశించడంలేదు. కాని మనుషుల మనస్తత్వాలలో, విశ్వాసానికీ, మాటమర్యాదకీ కూడా తావుంది. ఇవే ఈ ఒడంబడికను అమలుజరిపి చూడాలనే నిశ్చయానికి నాకు దారితీశాయి. చిత్తశుద్ధితో ప్రయత్నంచేద్దాం. వంగదేశ వాసులను ఇంతకు మించి నేనేమీ కోరను" అన్నారు సర్దార్ పటేల్.

వంగదేశసుల యాతనలు దుఃఖాలను గురించి రాత్రింపగళ్లు సర్దార్ పటేల్ యోచించారు. వారికష్టాల్లో వారి నాదుకోవాలనే ఆత్రుతలో ఈ అవకాశం పురస్కరించుకుని కలకత్తా వెళ్లారు. పాకిస్తాన్‌తో సమాధానానికి రావడంతప్ప శాంతియుతమైన మార్గం మరొకటేదీ గోచరించడంలేదు. అనేకమంది అనేకవిమర్శనలు చేసినవారున్నారుగాని అన్యపరిష్కారం చూపినవారులేరు. కాబట్టి లక్షలాదిప్రజల మానప్రాణాలకు సంబంధించిన ఈసమస్య పరిష్కారంలో ప్రభుత్వానికి పూర్తిగా తోడ్పడవలసిన బాధ్యత ప్రజలపైన ఉంది.

పాకిస్తాన్ రాజ్యాంగ వ్యవస్థలో హిందువులకు మహమ్మదీయులతో సమానమైన ప్రతిపత్తి ఉన్నట్లు లియాఖత్ అలీఖాన్ చెప్తున్నారు. అదే ఇస్లామిక్ సాంఘిక వ్యవస్థకు ఆదర్శమన్నారు.

ఈ విషయాన్ని అనుభవంలో పరీక్ష చెయ్యడానికి నిరీక్షించవలసిందే. పాకిస్తాన్ భారతదేశాలలోని ఈతరంవారికి సన్నిహిత సంబంధబాంధవ్యాలున్నాయి. ముమ్ముందు తరాలవారిలోనైనా ఈ సన్నిహితభావం తొలగిపోతే పరిస్థితులు అనుకూలించగలవేమో చూడవలసి ఉందని సర్దార్ పటేల్ అన్నారు.

అంతవరకూ పరిస్థితులు ప్రమాదభరితం కాకుండా ఉంటే అప్పుడు చూడవచ్చును. అప్పుడు కూడా సన్నిహితభావం తొలక్కపోతే, భరతఖండవిభజన అక్రమమనీ, ద్విజాతిసిద్ధాంతం బూటకమనీ భారతీయులు నిర్ధారణచేసుకోగలరు. కాని పాకిస్తాన్ నాయకులు సమ్మతించడం అసంభవం. వచ్చేతరంనాటికి ఈ సమస్య పరిష్కారం కాకపోతే విప్లవం, పునరైక్యత అనివార్యం కాగలవు. శత్రుత్వంవల్ల సన్నిహితభావాన్ని నిర్మూలించడానికి పాకిస్తాన్ నాయకులు ప్రయత్నిస్తున్నారనేది స్పష్టమే. ఇప్పటి ఢిల్లీ ఒడంబడికకు పునాది అదే. కాని ఇది ఎంతవరకూ ఒనగూడుతుంది అనేదే ప్రశ్న. ఈ ఒడంబడికతో తూర్పుబెంగాల్లో హిందువుల సముద్ధరణ జరిగితే పాకిస్తాన్ సుస్థిరం కావడానికి అవకాశంఉంది. లేదా సంఘర్షణ తప్పదు. పండిట్ నెహ్రూ కాని, కాంగ్రెస్ ప్రభుత్వాలుగాని చిరకాలం ప్రజల్ని అదుపులో ఉంచలేవు. ప్రజల్లో సహనానికి హద్దుఉంది. సర్దార్ పటేల్ ఉపన్యాసాన్ని బట్టి ఈ భావాలే ఉత్పన్నమౌతాయి.

తూర్పు బెంగాల్ నుంచి పారిపోయి వచ్చినవారిని .తిరిగి స్వస్థలానికి వెళ్లవలసిందని ఉద్బోధిస్తూ సర్దార్ పటేల్ ఇల్లా అన్నారు: "రాలేక అక్కడే ఉండిపోయిన వారి నిస్సహాయతనూ, నిస్పృహభావాన్నీ వారి దుర్గతినీ మీరు గమనించారా? వారు మీవలెనే యమయాతనల ననుభవించారు. ఆత్మరక్షణ సహజధర్మమే కావచ్చును. కాని అవసరసమయాల్లో తోటివారికష్టాలలో దుఃఖాలలో పాలుపంచుకోవాలనేది కూడా మానవధర్మాలలో ఒకటే. దేశవిభజనానంతరం తమదేశంపట్ల తమసోదరులపట్ల మీ కర్తవ్యాన్ని మీరు నిర్వహించి, మీ సోదరుల అండనే ఉంటే, భగ్నమనస్కులూ నిస్తేజులూ అయినవారిని మీరుద్ధరించగలిగేవారేనని నా దృఢవిశ్వాసం." అసమర్థక్రోధాన్ని విడిచి ఈ ఒడంబడికను మనస్ఫూర్తిగా అమలు జరపడానికి కృషిచెయ్యవలసిందని సర్దార్ పటేల్ పశ్చిమబెంగాల్ వాసుల్ని అర్థించారు.

ఈ పర్యాయం ఒడంబడికను అమలు జరపడానికి ప్రక్రియ నిర్ణయించబడింది. ఇదివరలో రెండు ఒడంబడికల్లోనూ ఇటువంటి ఏర్పాటులేదు. కాబట్టి ఈ ఒడంబడికను పాకిస్తాన్ ఎంతవరకూ అమలు జరుపుతున్నదో గ్రహించవచ్చునని పటేల్ అన్నారు అయితే ఇవి అంత సులువు కాదని డా॥ ముఖర్జీ అభిప్రాయం. ఈ విషయాన్ని స్వయంగా పరిశీలించి చూడ్డానికి ప్రభుత్వాన్ని విడిచి దేశంవచ్చినట్లు వారన్నారు.

ఇంతవరకూ ఒడంబడికవల్ల కొన్ని సత్ఫలితాలు కలిగినమాట నిజమే. తూర్పు పాకిస్తాన్‌నుంచి వచ్చే శరణార్థుల సంఖ్య తగ్గింది. ఉభయప్రాంతాల్లోనూ భయభీతులు తగ్గాయి. పాకిస్తాన్ పత్రికల విషప్రచారం కొంత తగ్గిందే. వచ్చే శరణార్థుల్ని అట్టే బాధించకుండా పాకిస్తాన్ అధికారులు రానిస్తున్నారు. భారతదేశంనుంచి మహమ్మదీయుల పరారి దాదాపు పూర్తిగా నిలిచిపోయింది.

తూర్పుబెంగాల్లో ఒడంబడికషరతుల్ని అమలుజరపడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. మైనారిటీ కమిషన్‌కు ఎన్నికలు జరిగాయి. హిందువుల తరఫున ఒక కాంగ్రెస్ వాది ఎన్నికైనాడు. మతకలహాల విచారణకు ఒక న్యాయమూర్తిని నియమించారు. పశ్చిమబెంగాల్, తూర్పుబెంగాల్, అస్సాం, త్రిపుర ప్రభుత్వోద్యోగులు సమావేశమై అమలు జరపవలసిన కార్యక్రమాన్ని గురించి చర్చించారు.

భారతదేశం పాకిస్తాన్లమధ్య స్తంభించిపోయిన వాణిజ్యాన్ని పునరుద్ధరించడానికిగాను తాత్కాలికపు టొడంబడిక తయారుచెయ్యబడింది. రూపాయల మారకాలతో నిమిత్తంలేకుండా కేవలం భారతదేశపు

(37 వ పేజీ చూడుడు)

# విలియం షేక్స్పియర్

జీవితవిషయాలలో, ఈ మహాప్రతిభుని గురించి తెలిసినవి బహుస్వల్పము. ఇతను పుట్టి మూడువందల ముప్పాతికేళ్లుమాత్రమే అయింది. ఇంతకన్నా పూర్వుల జీవిత విశేషాలు, దైనికంగా తెలిసినవి చాలా ఉన్నాయి. కాని ప్రపంచమహారత్నాలలో ఒకడైన ఇతని జీవితవిషయంలో తెలిసినవిషయాలకన్నా ఊహాగానాలే ఎక్కువ మిగిలాయి.

"ఇంగ్లండు, వెస్పెర్విక్ జిల్లా స్ట్రాట్‌ఫోర్డు ఆన్ ఏవన్ అనే పల్లెలో జన్మించాడు. అక్కడే పెళ్లిచేసికొని బిడ్డల గన్నాడు. 23,24 ఏళ్ళప్రాయంలో లండన్ వచ్చాడు. నటు డయ్యాడు. నాటకాలు వ్రాశాడు. ఏభై ఏండ్లప్రాయంలో జన్మస్థానానికి తిరిగి వెళ్లాడు. అక్కడో రెండుమూడువిళ్లు గడిపాడు. చనిపోయాడు. చనిపోయేముందు వీలునామా ఒకటి వ్రాశాడు."

అన్న యీ మాటలను మించి షేక్స్పియర్ జీవితవిశేషాలను గురించి ఋజువుగా ఏమీ చెప్పలేము." అని స్టీవెన్సు చెప్పినట్లు, ఇంత మించి ఏ విషయం చెప్పినా, గోరంతవిషయం అందుకొని కొండంత అల్లుకొనిపోవటం అవుతుంది తప్ప ప్రమాణం ఉండటం కష్టమే.

ఏభైరెండేళ్లలో జీవితంలో ముప్పైఏడు నాటకాలు వ్రాశాడు. కావ్యాలు వ్రాశాడు. ప్రపంచసాహిత్యంలో, అఖండ జ్యోతిని అమరంగా వెల్గించాడు. ఆపరిమళం శాశ్వతంగా ప్రపంచవాతావరణాన్నంతటిని సురభిళమయం చేసింది. కాని ఇంతటి పరిమళంలోనూ, స్వజీవితవిశేషాన్ని ప్రతిఫలించే, చిరువాసనకూడా వదిలివెళ్ళే స్వార్థం ఆ మహాకవికి లేకపోయింది. అనంతమైన జీవితానుభవాన్ని తన నాటకాలలో అసంఖ్యాకమైన పాత్రల రూపాల నిచ్చి సజీవంగా అనుభవించాడు. ఒక్కపాత్రలోనూ తన స్వల్పస్వార్థాలతో ప్రవేశించిన చిన్నతనపుచేష్టకు పోలేదు. ఏపాత్ర "పెళ్లిపల్లకీ"లోనూ తానుకూడా ఎక్కి ఊరేగాలని ఉబలాటపడలేదు. జూలియస్ సీజరు, బ్రూటస్, ఆంగ్లసామ్రాజ్య సామ్రాట్టులు, రోమక, గ్రీకు, ట్రోజన్ వీరులూ, అనేకులలో ప్రవేశించి, జన్మసిద్ధమై, జనసిద్ధమై పెంపొందిన తన అపార భావుకజ్ఞానంకల్ల, మళ్లుగానే ప్రవర్తింప చేశాడు. ప్రపంచానికి ఆ మూర్తుల స్వరూపాలు దిద్ది చూపించటంలో, "అణోరణీయాన్, మహతో మహీయాన్" అన్న విస్తృతిపొందిన తన జ్ఞానాన్ని వాళ్ల మూసలలోకే పొదిగి తీర్చిదిద్ది వెలువరించాడుతప్ప, తక్కిన కవులలాగా, "తన"ను సర్వత్రా, 'తగుల'వేసికొనే ఉబలాటంలో పడిపోలేదు.

ప్రపంచంలో బాధలు ఏం పడ్డాడో, వ్రాతలలో సంతృప్తితో సుష్టుగా జీవించిన వ్యక్తి అయినట్లే ఆవ్రాతల నిండుతనం సూచిస్తుంది. ఆ జీవితంలో బాధలే పడి ఉంటే, ఆ బాధలన్నీ బంగారపు ఆభరణాలు చేసినదిలాడు ఆరసవాది.



అంతపేరు, అంత శాశ్వతత్వం తెచ్చుకొనేందుకు, ఆ ముప్పైఏడు నాటకాలలో ఏ ఒకటిరెండు తీసికొన్నా చాలునేమో అనిపిస్తుంది. కాని ఆ ముప్పైఏడింటిలో ఏఒకటి తగ్గినా ప్రపంచసాహిత్యమే కొరత వడిపోయే దనిపిస్తుంది. ఆ నాటకాలను తీసివేస్తే, పాశ్చాత్యులు, ప్రాచ్యులతో తుల తూగి రాగల సాహిత్యమే కనబడేదికాదు. ప్రపంచసాహిత్యానికి శాశ్వతంగా ఉండగల లోటు ఇంతింతఅని చెప్పటానికి వీలు లేదు.

జీవితకాలంలోనే అతని ప్రతిభ గుర్తింపబడింది. ఆతర్వాత అంతకన్నా ప్రచండజ్యోతిగా సాహిత్యంలో మిగిలింది.

స్ట్రాట్‌ఫర్డు, ఆన్ ఏవన్, పారిష్ రిజిస్టరులో క్రైస్తవఆచారాలప్రకారం షేక్స్పియర్ శిశుస్నానకం (*Baptsm*) (మనలో బారసాల వంటిది) జరిగిన దినం 26 ఏప్రిల్ 1564 గా రిజిస్టరుఅయి ఉంది. బిడ్డపుట్టిన మూడోనాటికి ఈ బాప్టిజం జరగటం అలవాటు. కాబట్టి 23 ఏప్రిల్ షేక్స్పియర్ జన్మదినం అని అంచనావేశారు. కాని అతను 1616, ఏప్రియల్ 23 న చనిపోయాడని ఆఊరి రిజిస్టరులోనే ఉన్నచోట 53 వ ఏట చనిపోయాడని ఉంది. అందుచేత జన్మదినం, ఇంకొంచెం ముందేమో అని అనుమానం. తప్పో, ఒప్పో, జన్మకూ, సిద్ధికీ కూడా ఏప్రిల్ 23 నే సంస్మరణదినంగా మిగిలింది. విలియం షేక్స్పియర్ తండ్రి జాన్ షేక్స్పియర్. స్ట్రాట్‌ఫర్డు తాలూకాలో బరెక్ హోదాలో ఉండేవాడు. కొంత ధనిక భూస్వామి కావచ్చును, కొందరి కథనాన్ని బట్టి కసాయివృత్తిలో ఉండేవాడని తెలుస్తుంది. అంతకన్న పూర్వకథ, ఉన్ని వ్యాపారం చేస్తుండేవాడని, ఏదైనా ఊళ్లో పలుకుబడికలవారు. ఊరి పెద్దలైన కట్టుగ్రకాలలో ఒకడుగా, 1568 లో

హై బెలిఫ్‌గానూ, 1571లో ఛీఫ్ ఆల్డర్మన్‌గానూ, గ్రామంలోకల్లా పెద్దపెత్తందారీ ఉద్యోగాలలో ఉండేవాడని తెలుస్తుంది. ఆ ఊళ్లో భూములూ పుట్రా, వ్యవసాయం అంతా ఉండేది. 1557 లో జాన్ షేక్స్పియర్, పెళ్లిచేసుకొన్నాడు. భార్య మేరీ ఆర్డెన్, కులీనకుటుంబానికిని చెందిన పడుచు రాబర్టు ఆర్డెన్‌కుమార్తె. ఆమె, ప్రపంచ ప్రఖ్యాతుడైన మహాకవిని గన్న పుణ్యానికి నోచుకొంది. ఆమెకు మొత్తం సంతానం ఎనమండుగురు. నల్గురుకొడుకులు నల్గురు కూతుళ్లు. పెద్దవాళ్లిద్దరూ కూతుళ్లు జాన్, మార్గరేటులు. మూడో కాన్పు, విలియం షేక్స్పియర్, తరువాతివాడు గిల్బర్టు. మళ్లీ యిద్దరు కూతుళ్లు, జోన్, ఆనీ, తరువాతి కొడుకు రిచర్డు. కడసారి బిడ్డ ఎడ్మండు, విలియంకన్నా పదహారేళ్లు చిన్నవాడు. విలియం అప్పచెల్లెళ్లంతా చిన్నయీడునే చనిపోయారు. తమ్ములంతా పెద్ద యీడు దాకా బ్రతికారు.

విలియం జన్మించేనాటికి, తండ్రి సంపద ఉచ్చలో ఉంది. కొడుక్కు తలిదండ్రులు కావలసినవన్ని సమకూర్చి పెట్టారు. అతను పుట్టిన ఏట, ప్లేగు, మహామారి వ్యాధులు, చుట్టుపట్టుల పల్లెలలో బిడ్డలనూ పెద్దలనూ కూడ తుడిచిపెట్టేసింది. కాని దైవం మానవజాతిని కరుణించి ఈబిడ్డను బ్రతకనిచ్చాడు.

చిన్ననాడు పల్లెపట్టు ఆటపాటలలో, శుభ్ర వాతావరణంలో, భవిష్యత్ప్రతిభకు పాత్రోచితమైన మనోదుర్గాన్ని, హృదయవైశాల్యాన్ని సంపాదించుకొన్నాడు. ఆనాడు పసి మనస్సుతో గ్రహించిన ప్రకృతిరామణీయకతనంతా, ఆస్నిగ్ధత్వం చెడకుండా, కట్టకడపటి నాటకంలోదాకా మిగుల్చుకున్నాడు.

ఆకాలంలో గ్రామరుస్కూల్ అనే వీధిబడులు మాదిరి బడులుండేవి.

షేక్స్పియర్ ఇక్కడ చదువుకొన్నాడనే ఊహించుకోవాలి. పెళ్లి అయేదాకా కూడా ఆఊళ్లోనే, స్ట్రాట్ ఫర్డు అన్ ఎవాన్‌లోనే ఉన్నాడనీ కూడా అనుకోవాల్సివస్తుంది. అక్కడి గ్రామరుస్కూళ్ల చదువులుకూడా మన పల్లెటి వీధిబడుల చదువులలాగా కొన్నివిషయాలలో బహు స్వల్పబోధ, మరికొన్ని భాషా, పూర్వ కావ్యాలు, మొదలైన వాట్లల్లో బహు విస్తృతంగానూ గాఢంగానూ ఉండేదేనేమో అవి షేక్స్పియర్‌కున్న పూర్వసాహిత్య జ్ఞానాన్ని, గ్రీకులాటిన్ సాహిత్య పరిచయాన్ని బట్టి అనుకోవాల్సివస్తుంది. ఏమైనా, భాషాపండితుల లెఖ్ఖకువచ్చే విశ్వవిద్యాలయపు చదువులు చదివినవాడు కాడు షేక్స్పియర్. బహుశా, ఆ అపారమైన జ్ఞానతృష్ణలో స్కూలుచదువుకన్న, శృత పాండిత్యమూ, కనబడిన పుస్తకం అల్లా చదవటంవల్ల, విశేషవిజ్ఞానమూ,సంపాదించుకొన్నాడనుకోవచ్చు. కానున్న తక్కినవారంతా చదివి తెలిసికోవలసినవి ప్రతిభావంతునికి పూర్వజన్మవాసనవల్ల జన్మసిద్ధంగా వస్తాయని, పార్వతి చదువు విషయంలో కాళిదాసు చెప్పినట్లుగా అనుకోవలసి ఉంటుంది.

స్ట్రాటుఫర్టు గ్రామంనించి పొలాల పుంతలుపట్టి పోతే మైలుదూరంలో "షాటరీ" అన్న కుగ్రామం కనబడుతుంది. గ్రామం చిన్నదైనా, చూడచక్కగా ఉంటుంది. ఆ గ్రామంలోనే చక్కని అమ్మాయి ఉంది. ఆనీహేధవే, షేక్స్పియర్ ప్రియురాలు. ఈ యువకునికన్నా ఎనిమిదేళ్లు పెద్దది. ఆమె తండ్రి రిచర్డుహేధవేకుటుంబానికీ షేక్స్పియర్‌కుటుంబానికీ పూర్వంనుంచే స్నేహాలూ, రాకపోకలూ ఉన్నాయి. 1882 సంవత్సరాంతంలో విలియం ఆనీలకు వివాహం జరిగింది. పెద్దలు ఒప్పుకొన్నవనే భావించవచ్చును.

ఆ దంపతులకు ముగ్గురు పిల్లలు కలిగారు. పెద్దకూతురు సుసన్న, తక్కినవాళ్లిద్దరూ కొడుకూ కూతురూ కవలపిల్లలు. కొడుకు హేమ్నెట్ పదకొండున్నర ఏళ్లు బ్రతికి చనిపోయాడు. కూతుళ్లిద్దరూ పెద్దలై అత్తవారిళ్లకు వెళ్లి, తండ్రి తర్వాత చాలాకాలం వరకూ సుఖంగా బ్రతికారు. చిన్నప్పుడు వాళ్లకు మంచిచదువులే చెప్పించి, మంచి కుటుంబాలలోకే వివాహం చేశాడు షేక్స్పియర్. తెలివైనపిల్లలని కూతుళ్లుకూడా పేరు తెచ్చుకున్నారు.

పెళ్లి అయిన కొద్దిసంవత్సరాలకే, ఇరవై రెండోఏటనే - భార్యను బిడ్డలను తన పల్లెలోనే వదలి, బ్రతుకు బాగుచేసుకొందామని పట్టణం బయలుదేరాడు. ఊళ్లో యిబ్బందుల వల్ల హఠాత్తుగా లండన్ బయలుదేరాడని పుక్కిటిపురాణా లున్నాయి. వాట్లన్నిటికన్నా, ఆ భవిష్యత్తూ, ఆ ప్రతిభ, అతన్ని అల్లా లండన్ నడిపించాయని చెప్పుకోటం శ్రేయస్కరం.

అతనిపల్లెలోనే చిన్నతనంలో ఒక నాటకం కంపెనీ లండన్ పట్టణంనుంచి వాళ్ల ఊరువచ్చి నాటకాలాడి పోయింది. 1579-1587 సంవత్సరాలమధ్య, 'బర్బేజీల' నాటకంకంపెనీ స్ట్రాటఫర్టుగ్రామాల్లో నాటకాలాడి వెళ్లింది. కంపెనీమానేజరుకొడుకు రిచర్డు బర్బేజి షేక్స్పియర్‌కన్నా మూడేళ్లచిన్నవాడు. షేక్స్పియర్‌కు కవిత్వం అన్నా నాటకాలన్నా సరదా ఉండేది. ముందర పద్యాలు వ్రాశాడు. కాని వాట్లకు లండన్ రావలసిన అవసరం లేదు. కాని ఆరోజుల్లో మహాకవులంతా గ్రీన్, మార్లో, బెన్‌జాన్‌సన్, హేవుడ్, వెబ్స్టర్ మొదలైనవాళ్లంతా, కావ్యనాటకకళలను మిళితమొనర్చుకొని నాటకరంగఅభివృద్ధికి పాటుపడినవారే. బర్బేజీబాలునిస్నేహమే లండన్‌రప్పించిందో, నటనాకౌతూహలమే అక్కడకు లాక్కొనివచ్చిందో, రెండూ కలిశాయో ఏదైతే యేం, నటుడుగా పేరు తెచ్చుకొనేందుకు లండన్‌వచ్చాడు. అప్పటికి ఆరునాటకం కంపెనీలు లండన్‌లో నాటకాలాడుతున్నాయి. పిల్లలతో నాటకాలాడించే కంపెనీలు రెండున్నాయి.

మొదట లార్డు స్ట్రేంజి నాటకం కంపెనీలో చేరాడంటారు. ఆ తర్వాత ఆ కంపెనీ మరోనాటకం కంపెనీతో కలిసిపోయింది. ఆ రోజుల్లోనూ ఆ తర్వాత కూడా ప్రశస్తమయిన నాటకం కంపెనీ అది. జేమ్సు బర్బేజి దానికి మేనేజరుగా ఉండేవాడు. అతనే 1599 లో గ్లోబ్ థియేటర్ నిర్మించి తన కంపెనీ అక్కడకు మార్చాడు. బర్బేజీ కంపెనీ నాటకాలకు ఇంగ్లండురాణీఆదరణ ఉండేది. రిచర్డు బర్బేజీ, షేక్స్పియర్లకు ప్రాణస్నేహము. నటనలో ప్రావీణ్యమే కాకుండా, తమకు కావలసిన నాటకాలు కూడా వ్రాసే మిత్రుడు దొరికేటప్పటికి బర్బేజీ ఉప్పొంగిపోయాడు. షేక్స్పియరును తమలో కల్పుకొన్నారు. షేక్స్పియర్‌నాటకాలలో ప్రముఖపాత్రలన్నీ రిచర్డుబర్బేజీ వేసేవాడు. ఆ పాత్రలను అత్యద్భుతంగా నటించి చూపేవాడు. హేమ్లెటు, రిచర్డు III, ఒథెల్లో మొదలైన వేషాల్లో బర్బేజిని చూసి ఆనాటిరసజ్ఞులందరూ ముగ్ధులైపోయారు.

(37-వ పేజీ చూడుడు)

నవల:




శ్రీ నోరి నరసింహశాస్త్రి

## ౨౮

మోటుపల్లి విజయవార్త చేరినవంటనే శ్రీరుద్రదేవమహారాజు స్వయముగా శ్రీగణపతిదేవుల దర్శించి వారికా శుభవార్త ముందుగా నెరిగించెను. విజయదశమినాడు రాజ్యభారము కుమార్తె కప్పగించినదాది గణపతిదేవుల యారోగ్యము బాగుపడజొచ్చెను. శరీరదార్ఢ్యము క్షీణించిపోయినదినములలోగూడ ఆయనబుద్ధిలోని చురుకుదనముమాత్రము ఏమాత్రము క్షీణించి యుండలేదు. శ్రీ రుద్రమదేవుల యభిషేకము నిశ్చితమగువరకు భావిప్రభువును గూర్చిన చింత నిరంతర మాతని వేధించుచుండెను. ఆ విచార మంతయు రాజగురువులగు శ్రీ విశ్వేశ్వరశంభువుల ధర్మనిర్ణయముతో అట్టె విరిసిపోయెను. శ్రీగురువుల యాదేశానుసారము తాను చేసిన నిర్ణయము ప్రకృతు లంగీకరించిరి. దానితో చక్రవర్తిమనస్సు స్వస్థ మయ్యెను. మనస్స్వాస్థ్యముతోపాటు శరీరమునకు ఓజస్సు ప్రారంభించెను. పట్టాభిషేకానంతర మది మరింత స్థిరపడసాగెను.

కాని తదాది గణపతిదేవులు రాజ్యకార్యములలో జోక్యము కలిగించుకొనుటలేదు. కొంతకాలము రుద్రమ ప్రధానకార్యములలో తానే స్వయముగా పితృదేవుల దర్శించి వారిని కర్తవ్య మేమో ఉపదేశింప నర్థించుచుండెను. అట్లు కుమార్తె చెప్పుచున్న విషయము లన్నియు శాంతముగా నాత డాలకించును. తుదకు ఉపదేశ మర్థించినప్పుడు వేరేమియు పలుకక 'శివేచ్ఛ నిర్వర్తింపుము' అని మాత్రమే ఉపదేశించును. ఎన్నిమారు లడిగినను ఆతడు, 'శివేచ్ఛ చేయుము' 'శివాజ్ఞ పాలింపుము' ఇత్యాదిగా ఒకే యర్థ మిచ్చు నుపదేశము చేయుచుండెను.

అనాదిగా భరతఖండములో రాజపుత్రులు ఆన్వీక్షికితోపాటు వేదవేదాంగముల సారమును సాహిత్యరహస్యములను చతుష్షష్టికళలను సూక్ష్మముగా నభ్యసించుచుండిరి. అవియు ఋషితుల్యులును అనుభవశాలురు నగు మహానుభావులే వారి కుపదేశించుచుండుటచే ఆ రాజపుత్రులకు భారతీయధర్మము దృఢముగా నబ్బుచుండెను. అందుచే వారు తమకు సులభసాధ్యము లగు భోగములందు లౌల్యమును అధికారమునందు దుర్మదమును పరిహరించి ప్రవర్తింపజాలుచుండిరి. వారు నిర్లిప్తులు. వారికి జనకమహారాజు ఆదర్శప్రభువుగా భాసించుచుండెను. వారును దాన రాజర్షులే. ఆంతరంగికకార్యములలో నిష్పక్షపాతముతో గూడిన ధర్మవిచక్షణయు వైదేశికవ్యవహారములలో దక్షతయు వారికి సులభముగా నలవడుచుండెను. రాజ్యతంత్రనిర్వహణము వారొకవిధిగా తలంచి యందు పాల్గొనుచుండిరి.

ఇట్టి విద్య నేర్చినవారిలో కొందరు విద్యానంతరముననే విరక్తులగుచు రాజ్యతంత్రము నిర్వహించు నిచ్ఛలేనివారై తమ తమ్ములకో మరియొకరికో రాజ్యభారమప్పగించి మునివృత్తి కాలము గడప వనము కేగుటయు కద్దు. అట్టిది అరుదు. కాని వార్ధకము వచ్చినపిమ్మట సమర్థుడగు తమ్ముడో కుమారుడో ఉన్నచో అట్టివానికి రాజ్యభార మప్పగించి తాము వనప్రస్థు లగుటమాత్రము సర్వసామాన్యమే. అట్లు పరులకు రాజ్యభార మప్పగించినపిమ్మట వారు మరల రాజ్యతంత్రములో జోక్యము పూర్తిగా మానుకొనుచుండిరి. వారికి బ్రహ్మచర్యముననే ఉపదిష్టమై, రాజ్యభారము వహించిన దినములలో విస్మృతము కాకున్న, అధ్యాత్మవిద్య నిప్పుడు వారు సాధింప నిరంతరసాధన చేయుదురు. రాత్రిందివమును భగవద్ధ్యానము, సత్కథాకాలక్షేపములు, అధ్యాత్మచింతనములతో వారు కాలము గడపుచుందురు. వనమునకు వెళ్లినను, పురమున నున్నను వారు వనప్రస్థులే. అట్టి వనప్రస్థవృత్తినే గణపతిదేవచక్రవర్తి విజయదశమినాటినుండి సాగించుచుండెను.

ఆ కారణముననే రుద్రమ ముందు ఎన్నిమారులు రాజకార్యములు నివేదించినను ఆతడు విని 'శివాజ్ఞ నెరవేర్పు' మనియే ఉపదేశించుచుండెను. కొన్ని పర్యాయములు మరలమరల నట్లే జరిగిన పిమ్మట రుద్రమయు వారికి రాజకార్యములు నివేదించుటయే మానెను. భగవత్కాలక్షేపముతో ప్రొద్దుపుచ్చు పితృదేవులను వారు సన్యసించిన రాజ్యపు చింతలతో మరల బాధించు టేల? కాని వారు శివేచ్ఛ నెరవేర్పు మని పలుమారులు ఉపదేశించినదిమాత్రము ఆమెహృదయములో దృఢముగా నాటుకొనిపోయెను. ఏ ముఖ్యకార్యమున నిశ్చయము చేయవలసివచ్చినను ఆమె శాంతముగా 'ఇందులో శివేచ్ఛ ఎట్లుండును?' అనియే విచారణ చేసి మరి నిశ్చయించును.

త్రిపురాంతకుడు మోటుపల్లి గొనినవార్త సామాన్యవార్త కాదు. అది మహాసాహసకార్యము. ఇప్పటికి ఐదారుసంవత్సరములుగా కాకతీయదండనాథులు తలపెట్టలేకుండిన గండకార్యము! ముందు రుద్రమసేనానులు సమర్థింపబోవు వీరవిహారనాటకమునకు ఇది నాంది. అదియును ఇంత శీఘ్రముగా నిర్వహింపబడుట యుచ్ఛ

తములలో నెల్ల అద్భుతము. అన్నిటికంటె ప్రధానమైనది ఇది శ్రీరుద్రదేవమహారాజుల ప్రథమ విజయము!

అందుచే వార్త విన్నంతనే రుద్రమ యానందతన్మయత నొంది ముందుగా పోయి పితృదేవుల కది ఎరిగించెను. ఈమధ్య రాజకార్యములు ఆమె గణపతిదేవుల కెరిగింపకుండెను గాని ఈ శుభవార్త ఎరిగింపకుండగలదా? వారి కీవార్త ఎరిగించి వారి యాశీర్వచనము పొందవలె ననియే ముం దామెకు స్ఫురించెను. వెంటనే యామె స్వయముగా పితృదేవుల దర్శించి శుభవార్త నివేదించెను.

గణపతిదేవు లావార్త పరమశాంతముగా నాలకించి తన ప్రసన్నదృష్టి రుద్రమపై నాపాదమస్తకము ప్రసరింపజేసి మ్రొక్కియున్న యామెను ఆశీర్వదించి లేవదీసెను. ఆపిమ్మట నత డొకపరి గవాక్షమునుండి తన దృష్టిని ఏకశిలానగరవీధులపై ప్రసరింపజేసెను. ఎం దెక్కడను మహోత్సవచిహ్నము లాతనికి గోచరింపలేదు. ఈమారు 'శివాజ్ఞ నెరవేర్పు'మను వాక్కులు ఆయననోట రాలేదు. అట్లు వచ్చుననికూడ రుద్రమ భావింపలేదు.

'నగరమున విజయోత్సవము ప్రకటించితిరా?'

గణపతిదేవు లాదేశింపలేదు; ప్రశ్నించిరి. అంతవరకు రుద్రమ యేమియు ననుకొనియుండలేదు. ఎవరిని ఆలోచింపలేదు. వార్త తెలిసినవెంటనే, శుభవార్త తండ్రి కెరిగింపవలె నని పరుగెత్తుకొనిపోవు పిల్లవానివలెనే, రుద్రమయు వచ్చి ఇట్లాతని కీవార్త యెరిగించియుండెను. గణపతిదేవు లిప్పు డీ ప్రశ్న వేయగా రుద్రమకు వెంటనే కర్తవ్యము స్ఫురించినది. వారు ప్రశ్నయే వేసినను అదియును ఒక ఆదేశమే. గణపతిదేవు లట్లాదేశింపకున్నచో నామె యాప్తమంత్రులతో నాలోచించిగాని యీ వార్త నగరములో ప్రకటించుటో మానుటోకూడ నిశ్చయించి యుండదు. కాని యిప్పుడట్టిది అవసరము లేదు. ఆ ప్రశ్నయే ఆదేశముగా గ్రహించి యామె వెంటనే మహాప్రధాను లగు గోవిందనాయకుని బయ్యననాయకుని తిక్కచమూపతిని అంబదేవుని బిలిపించి వారెల్లర కీ శుభవార్త గణపతిదేవుల సమక్షముననే ఎరిగించి మూడుదినములు విజయోత్సవములు రాజధానీనగరమునను చుట్టుప్రక్కలను ప్రధాననగరములను మహావైభవముతో జరుప నాజ్ఞాపించెను. వారందరు శ్రీరుద్రదేవ మహారాజులకు జయాభినందనములు చేయుచుండ గణపతిదేవులు ప్రమోదభరితులై తిలకించుచుండిరి. వా రంతట సెలవు తీసికొని యుత్సవసన్నాహములు చేయ బయలువెడలిరి.

ఆ పిమ్మట కొద్దిసేపటిలో గజశాలలనుండి గజఘటలు ఘంటానాదములతో బయలుదేరినవి. 'వీటఁ బీథులనెల్ల నేనుగులపై విస్ఫారఘంటాధ్వనిం జాటం బంపిరి పేర్మి' త్రిపురాంతకుని 'జయాశ్చర్యంబు!'

ఆ యుత్సవములో వీరప్రదర్శనకార్యక్రమమెల్ల అంబదేవుని కప్పగింపబడెను. ఏకశిలానగరమున ఉత్తరపార్శ్వమున హనుమకొండవరకు నొక పెద్దసరోవరము కలదు. దానిని 'భద్రిచెరువు' అని పిలుచుటయు కద్దు. దాని తూర్పుతీరమున పొడుగున రాచవారి బాహ్యోద్యానము కలదు. అందు పలుకుటీరాదులు నిర్మించుకొనిన రాజసైన్యముల స్కంధావార మున్నది. ఇప్పు డా స్కంధావారమంతయు నంబదేవుని యాజ్ఞలచే నొక్కుమ్మడిగా యాతాయాతజనవ్రాతముతోడను గజాశ్వరథములతోడను సందడించుచు సుద్బుద్ధమైన ట్లుండెను.

ఆ సాయంత్రమున నందుండి వీరభటసహస్రములు బారులుతీరి యూరేగసాగిరి. ముందు స్వలంకృతము లగు గజఘటలు, ఆ పిమ్మట చిత్రవర్ణములు గలిగి కనులు మిరుమిట్లు గొలిపించు గౌసేనలతో నలంకరింపబడిన యశ్వము లధిరోహించిన యాశ్వికదళములును, వానికి మధ్యమధ్య ప్రధానసేనాపతుల యాందోళికలును రథములును సాగుచుండెను. అందరికిని మధ్యగా సమున్నతగజముపై ముత్యాలు కూర్చిన అంబారీలో త్రిపురాంతకుని రూపము గంభీరమనోజ్ఞముగా చిత్రించిన పటమును, దాని ప్రక్కనే అంబదేవుడును ఉండి ఊరేగుచుండిరి. ఆ వెనుక మరల రథములు ఆందోళికలు ఆశ్వికదళములు గజఘటలు వచ్చుచుండెను. ఉత్సవము బారునను పదాతులు, ఖడ్గశూలాద్యాయుధధరులు ధనుర్ధరులు వరాహధ్వజహస్తులు, నై సాగుచుండిరి. మరియు వీణావేణువాద్యములును సన్నాయిలును మ్రోయించుచు నడుమ నడుమ పలువురు వెడలుచుండిరి. నట్టువకత్తెలు మోటుపల్లిజయము వీరరస ముట్టిపడునట్లు అభినయించుచు చూపర నాకర్షించుచుండిరి.

చత్వరములం దెల్ల చలువచప్పరము లున్నవి. అందు త్రిపురాంతకుని పట మున్న భద్రగజముపై పుష్పవృష్టి కురియుచుండెను. నగరమంతయు ముత్యాల రంగవల్లులు తీర్చబడియుండెను. వీథులెల్ల మంగళపత్రములతో పుష్పములతో తరణములతో నలంకృతములై యున్నవి. ఆ యూరేగింపు పట్టణమెల్లెడల సాగి జయజయనినాదములు మిన్నుముట్టుచుండ రాజప్రాసాదముముందున్న విశాల ప్రదేశమున నాగెను.

అచ్చట రాజమందిరములోనుండి సువాసినులు పూర్ణకుంభములతో నెదురువచ్చి మంగళారార్తికము లిచ్చిరి. అంతలో రాజభవనాట్టాలకమునుండి ఉన్నతాసనమున నున్న శ్రీ రుద్రదేవమహారాజులు దర్శన మిచ్చిరి.

వెంటనే ఆందోళికలు దింపబడెను. ఒక్కసారిగా నాందోళికలనుండియు రథములనుండియు ప్రధానదండనాథులు దిగి రుద్రదేవమహారాజులకు నతు లొనర్చిరి. త్రిపురాంతకుని పటముతో నంబదేవు డున్న భద్రగజము మావటీనిచే ప్రేరితమై రుద్రదేవమహారాజుల కెదురై మోకరించెను అంతట నొక్కసారి నిశ్శబ్ద మయ్యెను. అంబదేవుడు మహారాజులకు గొంతెత్తి జయజయనాదము లొనర్చెను. ఒక్కసారిగా నలుదిక్కుల ఘంటానాదములు పిక్కటిల్లెను.

ఆ రాత్రి మిక్కిలి ప్రొద్దుపోవువరకు వీరవినోదము లచ్చట సాగెను. అశ్వక్రీడలు, గజక్రీడలు, ఖడ్గయుద్ధములు, బాణప్రయోగములు, శూలకుంతాదిసాధనలు బహువిధముల ప్రదర్శింపబడెను. మల్లయుద్ధములు జరిగినవి. గండ డీనాడు సులభముగా ప్రతిమల్లుర నెల్ల రనోడించెను. అతడు విచిత్రభిక్షుకుని వెన్నంటిపోయిననాటిరాత్రి యనుభవముతో నాతనికి రెండుమూడునాళ్లు ఆందోళనమంది మనస్స్థిమితము లేకుండెను. కాని యిప్పటి కాతడు స్వస్థుడైనాడు. బొల్లడు దేశాంతరగతుడైనదాది గండని నెదిరించు ప్రతిమల్లుడే లేడు. పలువురు బొల్లనిగూర్చి యీనాడు మనస్సులలో స్మరించిరి.

ఆ మరునాడు మధ్యాహ్నమునుండి యపూర్వ మగు నాటక ప్రదర్శన మొకటి సాగినది. స్వయంభూదేవుని సరోవరమున క్రీడా

(31 వ పేజీ చూడుడు)

# ప్రతీకారం

శ్రీ చెరుకుమూడి రాధాకృష్ణమూర్తి

ఆతను ముక్కుపచ్చలారని పసికందు. పట్టుమని పధ్నాలుగేళ్లు నిండాయో లేదో..! అతనిపేరు కాళీప్రసాదు.

అయితే, బాబూ, ఘుండువంటి చలిలో గజగజ వణుకుతూ ఎక్కడికీ ప్రయాణం? ఆకలీ, తాపమూ వీటి రెంటినీ వెంటబెట్టుకొని ఎక్కడికి నాయనా సాహసించి పోతున్నావు?

• ఆకలి...తాపము...హుం అతని కివి ఒక లెక్కా? అతని హృదయంలో రగుల్కొంటుండే చిచ్చుముందర అవి ఎంత పాటివి!

కటిక చీకటి. ఒణుకు పుట్టించే చలి. కొన్ని గంటలనుంచీ ఏకధారగా వర్షము కురుస్తోంది. ఆకాశంలో కారుమబ్బులు అలముకున్నాయి. మచ్చుకొక రిక్కకన్య కూడా కానరాదు. గంగ అహోమాదిరిగా మొహం తేలవేసి ప్రవహిస్తూంది.

కాళీప్రసాదు అట్టే ఆలోచిస్తూ నిలబడ్డాడు. అతనెక్కడికి పోవాలి?

ఈ క్రూరప్రపంచంలో అతనికి తావు లేదా?

తనకు తెలీకుండానే ఒక చెట్టుకింద ఆగాడు.

దూరంలో ప్రేతభూమిలో తళుక్కుమంటూంది భగభగలాడే తేజస్సు. ఎక్కడిదా వెలుగు?

భౌతికయాత్రను చాలించిన ఒక మానవుని కబళించివైచే కారుచిచ్చు అది!

అటువంటి మృత్యుజ్యోతి అతని ముఖంలో తళుక్కుమంది.

క్రోధం, విసుగు, ప్రతీకారవాంఛ... అంతలేత ముఖంలో కూడా దాగివున్నాయ్.

జీవితంలోని విషాదఘట్టాలన్నీ అతని మనస్సో మారు నెమరవేసింది.

పాపం, అతని వయస్సు చూడబోతే పట్టుమని పదునాలుగేళ్లు లేవు. మరి అతని అనుభవాలు చూడబోతే...

కుటుంబాన్ని దారిద్ర్యదేవత క్రూరదంష్ట్రలనుండి తప్పించటానికి తన తండ్రి పడ్డ పాట్లు ఒక్కమారు అతని కండ్లకు కట్టినట్లగపించాయ్.

చివరికి తండ్రి మరణావస్థ...అతని వెర్రికేకలూ, దీనాలాపనలూ...తుదిమాటలూ చెవుల్లో గింగురుమన్నాయ్.

ఒళ్లు జలదరించింది!

ఆ పసికుర్రడు బలము కొద్దీ నేలను కాలితో తన్నాడు.

కోపావేశంతో "ప్రతీకారం...ప్రతీకారం" అని ఎలుగెత్తి అరచాడు.

వినీలమేఘాలు ఆ బాలునికి జవాబుయిచ్చాయి. ఉరుములు గగనవీథిని మారుమ్రోగాయి. మెరుపుతీగెలు ఆకసమంతా అలముకొన్నాయి. ఘోరగర్జనతో ఒక పెట్టున కుంభవర్షం కురిసింది. ఎక్కడజూచినా వెల్లువలే!

కానీ పాపం! ఈ జోరువాన ఆ పసికందు లేతహృదయంలో రగుల్కొంటుండే బాధను ఇనుమడింప జేసింది.

ప్రేతభూమిలో శవాన్ని దహిస్తుండే మంట ఆర్పినవర్షం...అదే వర్షం ఈ బాలుని హృదయాంతర్భాగంలోని జ్వాలకు ఆజ్యం పోసి విసనకర్రతో విసిరింది.

మళ్ళీ గద్గదకంఠంతో అరిచాడా డింభకుడు. "కసి...కసి తీర్చుకోవాలి...నా కొంపకు చిచ్చుపెట్టిన కఠినాత్ముని రూపుమాపాలి."

దూరంలో జ్యోతి కనిపించింది. ఏం బుద్ధిపుట్టిందో ఏమో దానివైపు దారి తీశాడు కాళీప్రసాద్.

ఆ వెలు గెక్కడిది? కోవెల గర్భగుడిలోంచి వస్తుందా వెలుగు.

దగ్గరకు పోయి చూచాడు. లోనుంచి గడియ వేసివుంది ఆ గర్భగుడికి.

గుడ్డలు బాగా తడిసిపోయాయి. అపరితమైన చలి ఆ బాలు నావరించింది. అలసి సొమ్మసిలిపోయి కోవెల మెట్లమీద కూలబడ్డాడు.

అతని హృదయంలోని ఆరాటం ఇంకా సమసిపోలేదు. అట్టే ఆలోచిస్తూ కూచున్నాడు.

ప్రకృతికన్య బాలునిపై జాలిగొని జోలపాటపాడుతూ అతణ్ని నిద్రబుచ్చింది.

ఆ నిద్రలో అతని కోకల. అతని తండ్రి తన కట్టెదుట నుంచున్నాడు. ఈర్ష్య, క్రోధం, కసి...ఇవి అతని ముఖంలోంచి మటుమాయమైనాయ్. వాటి స్థానే సంతోషం చిందులు తొక్కుతుంది. తండ్రి మెల్లగా తన శిరస్సుపై చేయివైచి 'లే. నాయనా, దిక్కులేనివాడికి దేవుడే దిక్కు, కసితీర్చుకోవాలంటే, అతడున్నాడుగా. లే, ఇక భయ మెందుకు?'

కాళీప్రసాదు ఉలిక్కిపడి లేచాడు.

ఏడీ తండ్రి?

"ప్రతీకారం......ప్రతీకారం" అనే మాటలు అప్రయత్నంగా అతని పెదవుల నుండి దూకాయి.

ఇంతలో ఎవరో కొత్తమనిషి తన శిరస్సుపై చేయివైచినట్లు చూచాడు. తన తండ్రియేనా ఇతను? చనిపోయిన తండ్రి మళ్లీ తనను ఉద్ధరించడానికోసం పునర్జీవుడయ్యాడా?

ఆ కొత్తమనిషి చేతిలో లాంతరు ఉంది. ఆ దీపపుకాంతి కాళీప్రసాదు ముఖాన్ని సోకింది.

ఆగంతుకుడు బాలునివైపు అట్టే చూచాడు. ఆ చూపుల్లో దయారసం తొణికిసలాడుతూంది!

"ఇతనేనా తన స్వప్నంలో కనిపించింది. విస్తుపోయాడు కాళీప్రసాదు."

"బిడ్డా, ఎవరవు నాయనా..."

ఆ కంఠంలో ఎంత దయ, ఏంత ప్రేమ ఉట్టిపడుతున్నాయ్.

"నేనొక బ్రాహ్మణబాలుణ్ణి."

"అయితే ఈ నిశీథంలో ఇంతవర్షంలో ఒంటరిగా తిరుగుతున్నా వెందుకు నాయనా?"

"నాకు 'నా' అని చెప్పుకోదగ్గవా ళ్లెవరూ లేరు. తల్లీ దండ్రీ లేని నిర్భాగ్యుణ్ని నేను."

ఆ వృద్ధుడు నిట్టూర్పు విడిచాడు. ఆ మధ్యనే చనిపోయిన కన్నపుత్రుడు జ్ఞాపకం వచ్చాడతనికి. అశ్రుకణాలు పటపటరాలి క్రిందికి దొర్లాయి. తను పోగొట్టుకొన్న బాలుని స్థలాన్ని పూరింపడానికి ఈ బాలుణ్ని దేవతలు తనకు ప్రసాదించారా యేమిటి" అని అచ్చెరువొందాడతను.

"నీ పేరేమి నాయనా?"

"కాళీప్రసాదు..."

"కాళీప్రసాదా?...ఈ దేవాలయం కాళికాదేవిది ..ఆమె ఆశీస్సులు నిన్ను రక్షించుగాక. నేను ఈ దేవాలయం అర్చకుణ్ని...లే, నాయనా, లే, మనం పోదాం. ఇంతటితో నీకు తండ్రి లేనికొరత తీరిపోతుంది.

* * *

ఆ రోజునుంచీ ఆ బాలుని కష్టాలు పటాపంచలయనాయ్. దేవీప్రసన్నుడు అతణ్ని తనయింటికి తీసికొనిపోయినాడు. అర్చకుడు దయాస్వరూపురాలగు అతని ధర్మపత్ని, కాళీప్రసాదును సొంత బిడ్డ మోస్తరుగా ప్రేమిస్తూ ఆదరించారు.

అర్చకుని బిడ్డలిద్దరు కూడా-ఒకబాలుడు, ఒకబాలిక-అతణ్ని ప్రేమింపసాగారు.

కాలచక్రం గిర్రున తిరిగింది.

మేఘమాలను కాళీప్రసాదు కిచ్చి కట్టబెట్టాలని అర్చకుడూ, అతని భార్యా నిశ్చయించుకున్నారు.

కాళీప్రసాదు హృదయం నవనీతం లాంటిది. అతను సద్గుణాలకు అటుపట్టువు. అంచేతనే అతనికి చెలికాండ్రు మిక్కుటం. ఇప్పుడు దేవాలయం తలుపులు సర్వదా తెరిచివుంచబడ్డాయి. వానలో చిక్కుకున్న బాటసారులకు ఎప్పుడూ గర్భగుడి అందుబాటులో వుంది. మరిన్ని దిక్కుమొక్కు లేని బీదప్రజానీకానికి దానధర్మాలు దేవాలయంలో ప్రతినిత్యమూ జరుగుతుంటాయి.

అర్చకునిలో ఈ మార్పు రావడానికి కాళీప్రసాదే కారణభూతుడని లోకవిదితమైంది. కాలం పోయిగానే దొర్లిపోతూంది. అయినా కాళీప్రసాదు హృదయంలోని ఆరాటం సమసిపోలేదు. కట్టబట్టా, తిన తిండీ లేని దౌర్భాగ్యదశలో నున్నపుడు కాళీప్రసాదును క్షోభపెట్టిన క్రూరసర్పమే ఇప్పుడు మళ్లీ తలయెత్తి బుసలుకొట్టూ అతని హృదయాన్ని కుంగదీస్తూంది. పగలనిలేదు, రాత్రనిలేదు...... అతనికిదే వ్యథ.

నడిరాత్రిలో ఇంట్లోవాళ్లంతా సుషుప్తిలో మునిగివుంటే కాళీప్రసాదు చీకట్లో తడుముకుంటూ దేవాలయానికి దారితీశే వాడు. ఆ కటికచీకట్లో ఒంటరిగా కూలబడి ఏమేమో ధ్యానించేవాడు.

మానవహృదయం ఎంత విచిత్రమైంది? ఎడతెంపిలేని ఈర్ష్య, క్రోధమూ, కసి, పగ...ఇవి దాన్ని కలచివైస్తుంటే దాని లోతుపాతులు గుర్తింపలేరు గదా?

* * *

దేవీప్రసన్నుని కుటుంబంలో దుఃఖరేఖలు ప్రాకాయి. అతని ఒక్కగాని ఒక్క కొడుక్కు జబ్బు. పాపం! తల్లిదండ్రుల కొకటే దిగులు. వాళ్లకు పుట్టినసంతానంలో ఒకరివెంబడి ఒకరు మృత్యువు వాతబడ్డారు. ఆఖర్కు మిగిలిన దిద్దరు. ఇప్పుడు జబ్బుతోవుండే బాలుడూ, అతని సోదరి మేఘమాల. రోగం క్షణక్షణానికీ ముదిరిపోతూంది. అయితే తమ కుమారుణ్ని ఎవరు రక్షిస్తారు? ఉన్నాడుగా కాళీప్రసాదు ......దేవి భక్తుడు!

స్నానంచేసి తడిబట్టలతో గర్భగుడిలో హోమంముందు కూచొని మంత్రా లుచ్చరిస్తున్నాడు కాళీప్రసాదు. దేవికి నైవేద్యం పెట్టాడు. దేవి సంతృప్తురాలైనట్లు తోచింది. ఆ జ్వాలు మింటికెగిసిపోతూన్నా యెందుకు? కాళీప్రసాదు తదేక ధ్యానంతో వున్నాడు. ఇన్నాళ్ళనుంచీ అతని హృదయాన్ని సంక్షోభ పెడుతుండే బాధ మళ్లీ ప్రత్యక్షమైంది. ఈ బాధ తీవ్రతను యింటిలో మంచంమీద మూల్గుతూ పడుకున్న బాలుని మాట మరిచిపోయాడు కాళీప్రసాదు. ఒక్కమారు అతని హృదయంలో దాగివుండే రోషం పైకుబికింది.

అప్రయత్నంగా "కసి...కసి"అని ఎలుగెత్తి అరచాడు కాళీప్రసాదు.

ఆ శబ్దానికి కోవెలగోడలు కంపించిపోయాయి. నీ కోరిక నెరవేరిందన్నట్లు జ్వాల ఒక్కమారు పైకి లేచింది...మళ్లీ చల్లబడిపోయింది.. ఇంటిలో...

అర్చకుని బాలుడు భౌతికయాత్ర చాలించాడు. తల్లి దండ్రులు గొల్లున ఏడుస్తున్నారు.

కాళీప్రసాదు తన తప్పిదాన్ని గుర్తించాడు. ఆ బాలుని బతికించమని తను దేవిని కోరియుంటే ఆ బాలుడు బతికివుండేవాడు.

అయితే ఏం లాభం?

అయిందేదో అయిపోయింది.

గతించినదానికి వగచి లాభమేమి?

మేఘమాల సంగతేమిటి?

తన సోదరుడు దివికేగిన దినమే...ఆవిడ పెదవులమీద నృత్యంచేసే చిరునవ్వు కాస్తా మటుమాయమైంది.

దిగులు, విచారంతో కుంగిపోయింది. హృదయావేదనతో ఆవిడకూడా మంద మెక్కింది.

* * *

కటికచీకట్లు నలుదిక్కులా కమ్ముకున్నాయ్. గాలీ, వానా, దిక్కులు దద్దరిల్లేటట్లు ఉరుములు.

దురదృష్టజాతకుడు కాళీప్రసాదు ఈ రోజు కూడా కాళికాదేవిగర్భగుడిలో కూచొని ఆరిపోయిన కంఠంతో ఏమేమో పలవరిస్తున్నాడు. ఆందోళనతో పదేపదే తన చూపులను దూరంలోవుండే పూరికొంపకేసి ప్రసరిస్తున్నాడు. కిటికిలోగుండా కనిపిస్తూంది - మంచంమీద మూలుగుతుండే మేఘమాల - తన భావిశ్రేయసి...

ఉన్నట్లుండి దూరంలో రోదన వినిపించింది. ఉలిక్కిపడి వెనక్కు తిరిగిచూచాడు కాళీప్రసాదు.

ఎవరది? దేవీప్రసన్నుడే!...పిచ్చివాని మోస్తరు వర్షంలో పరుగెత్తుతున్నాడు.

కాళీప్రసాదు అతణ్ని వెంబడించాడు. ఆ వృద్ధుని చేయిపట్టుకొని 'మేఘమాల?' అనిమాత్రం అనగలిగాడు.

'నన్ను పోనీ...నన్ను పోనీ...నాకో వింత దృశ్యం కనిపిస్తూంది' అని పెద్దపెట్టున అరుస్తూ అర్చకుడు చెయ్యి విదిలించాడు.

కాళీప్రసాదు ఆ వున్మత్తుని చేయి గట్టిగా పట్టుకొని, 'దృశ్యమా? ఏమి దృశ్యం బాబూ' అని అడిగాడు.

'అబ్బా, నన్ను పోనీ...నే వెతకాలి' విసుక్కున్నాడు కాళీప్రసాదు.

'వెతుకుతున్నారా? ఎవర్ని బాబూ? మీరు దేనికి వెతుకుతారు?'

(32 వ-పేజీ చూడుడు)

# దినదినాభివృద్ధి

ఒకరోజున పాప తదేకదీక్షగా అమ్మ ముఖం చూస్తాడు. అప్పటికి రెండో నెల నిండి ఉంటుంది. ఆచూపు అమ్మకి వింతగా కనిపిస్తుంది. అమాయకమైన ఆనందంతో అమ్మముఖంలో చిరునవ్వు వికసిస్తుంది. పాప కూడా అమ్మచిరునవ్వు కనిపెట్టినట్లు లక్కనోరు నిండా తెరిచినవ్వుతాడు. అమ్మకి ఆనందం తలమునకలౌతుంది. క్రమక్రమంగా పాపముఖంలో వెలుగు, కళ్ళలో కాంతి తెల్లకలువపువ్వులా వికసిస్తుంది. ఈ మార్పులన్నిటినీ అందరూ శ్రద్ధగా గమనించరు. అప్పుడప్పుడు కొన్ని మార్పుల్ని మాత్రం చూసి తల్లులు ఆనందిస్తారు. శ్రద్ధగా అన్ని మార్పులూ రోజురోజుకీ గమనించినట్లయితే, నరుపేదలూ భాగ్యవంతులూ అనే భేదం లేకుండా అందరూ జీవితంలోని సారాన్ని సమానంగా అనుభవించగలుగుతారు. అందని కోరికలకి ఆశాభంగంతో కుమిలేవారికి ఇది ఔషధంగా పనిచేస్తుంది. పసిబిడ్డల పెంపకంలో గల కష్టసుఖాల్ని రెండింటినీ ఆనందంతో గడపగలవారికి జీవితంలోని సుఖదుఃఖాల సారాన్ని సమానంగా అనుభవించగలుగుతారు.

వాస్తవంగా పసిపాప పెరుగుదలని చూడ్డం కంటె అలౌకికానందం వేరొకటి లేదు. పసిపాప 'విద్దెం' చేస్తుంటే ఆనందించని తల్లి ఉండదు. అన్ని విద్యలూ క్రమక్రమంగా నేరుస్తాడు. కాని ఈవిద్యలు నేర్వడం విచిత్రమైన విశేషం ఒకటుంది. లక్షలాదిసంవత్సరాలుగా మానవుడే మార్పులు పొందాడో ప్రతిబిడ్డా శైశవంలో అన్నిమార్పులూ అనుసరిస్తాడు. మానవుడిచరిత్రఅంతటికీ శైశవం పునరావృత్తి.

ఆదిలో భూమిపైన ప్రాణి స్థూలరూపం పొందినట్లే బిడ్డ మాతృగర్భంలో పిండరూపంలో ఆవిర్భవిస్తాడు. కొన్ని వారాల్లో మత్స్యావతార మెత్తుతాడు. ఆ స్థితిలో చేపకు వలె తిండానికి పొలుసులుంటాయి. ఉమ్మనీరులో ఈదుతాడు.

పుట్టిన ఏడాదికి కాళ్లపైన నిలబడ్డానికి ప్రయత్నాలు చేస్తాడు. అనేక లక్షల సంవత్సరాలకు పూర్వం మానవుడికి నిలబడ్డం కొత్తగా నేర్చినకాలంలో ఈ పాప మాదిరిగానే ప్రయత్నాలు చేశాడు. కాని పసిపాప కొద్ది మాసాల్లో నడవడం నేర్చుకోగలడు. ఆనాడు మానవులు నడవడం నేర్చుకోడానికి కొన్ని వేలఏళ్లు పట్టిఉండాలి. నిలవడం నేర్చినప్పుడే పసిపాపచేతుల్ని పక్కలికి తిప్పగలుగుతాడు. అంతకుముందు గిప్పిట ముడవగలగడం తెరవగలగడంతప్ప మరేమీ చేతగాదు. తరవాత రెండేసి వేళ్లనీ మూడేసి వేళ్లనీ మాత్రమే ఉపయోగించి వస్తువుల్ని పట్టుకోవడం నేర్చుకుంటాడు. అంతకు ముందు వస్తువుల్ని పట్టుకోవడం, విడిచిపెట్టడం తప్ప మరేమీ చేతకాదు. తరవాత వస్తువుల్ని జరపడం కూడా చేతనవుతుంది. గిలకల్ని చేతబట్టి పైకీ కిందికీ ఆడించి ముక్కుకేసి కొట్టుకోడంమాత్రమే చేతనైన చేతులు, పక్కలకి తిప్పడం రెండుచేతుల్తోనూ పట్టుకోడం నేర్చుకుంటాయి. ఆదిలో మనుషులు నిలవడం నేర్చుకున్నారంటే దానికొక అవసరం కలిగింది. నేలమీద పాకడంతో సరిపోలేదు. చేతుల్ని ఇతర పనులికి ఉపయోగించవలసిన అవసరం కలిగింది. అప్పుడు చేతులు కాళ్లమీద పాకే అలవాటుని తప్పించుకోవలసి వచ్చింది.

ఆరేళ్లుదాటిన బిడ్డ తల్లిదండ్రులపైన ఆధారపడ్డం తగ్గించుకుంటాడు. తల్లితండ్రి అన్నదమ్ములు అప్పచెల్లెళ్ల మధ్య గడపిన జీవితంలో మార్పులు తెచ్చుకుంటాడు. కొత్తవాళ్ళవద్ద మెలగడం వాళ్లతో స్వయంగా మాట్లాడ్డం నేర్చుకుంటాడు. స్వయంగా బుద్ధి నుపయోగించుకోడానికి ప్రయత్నిస్తాడు. దాగుడుమూతలాడుతుంటే పట్టుబడినా ఏడవడు. ఆటల కట్టుబాట్ల ప్రకారం ఆడగలడు. ఆదిలో మనుషులు భార్యాబిడ్డలతో అడవులు తిరగడం అట్టే మేలుకాదని గ్రహించి గ్రామాల్లో నివాసం ఏర్పరుచుకోడం నేర్చుకున్న రోజుల్లో వాళ్ళ పరిస్థితి ఆరేళ్ల బిడ్డల పరిస్థితిని పోలి ఉంటుంది. ఆతరవాత బిడ్డలు ఇది మంచి ఇది చెడ్డ అని లోలోపల తర్కించుకుని నిర్ణయాలు చేసుకోగలుగుతారు. నలుగురితోనూ కలిసిమెలిసి ఏలాఉండాలో నేర్చుకుంటారు.

పుట్టిన రెండుమూడు మాసాలవరకూ పసిపాప లోకంలో ఏపనీ పెట్టుకోడు. ఇన్ని రోజులూ వాడికి వాడి పొట్టలో ఆకలిఎలకలేం చెపుతాయో అవి తప్ప మరేవీ వినిపించవు. బొజ్జ నిండుగా ఉంటే చాలు బహుబుద్ధిమంతుడిలా ఉంటాడు. చడీచప్పుడూ చెయ్యకుండాఉంటాడు. అసలు రోజులో చాలసేపు నిద్రపోతాడు. ఆకలివేసినా, అజీర్ణం చేసినా, పొట్ట ఉబ్బినా, ఆట్టే నలిగినా ఇంక వాణ్ణి పట్ట తరంకాదు. ఆ బాధేతప్ప, అమ్మ ఎన్ని జోలపాటలు పాడినా వాడికి వినిపించవు. కొందరికి ఈ రోజుల్లో కోపం ఎక్కువుంటుంది. వాళ్ళకి పొట్టవిషయంలో ఏ తేడావచ్చినా గొంతు చించుకుఏడుస్తారు. గుక్కపట్టి ఏడుస్తారు. కొందరు, సావధానంగా పడుకుని, కేవలం ఏడుపే తన ఉద్యోగమైనట్లు, మందరస్థాయిలో ఆరోహణావరోహణాలు లేకుండా తెగూ

తెంపూ లేకుండా ఏడుస్తారు. కొందరికి కొంతసేపు ఏడిస్తేగాని నిద్రపట్టదు.

'మూడో నెల సగం దాటేసరికి ఇంక లోకంలో పడతాడు. బుర్ర ఇటూ అటూ తిప్పి చూస్తాడు. నిండాపండిన పంటచేను చూసుకున్న రైతులాగా లోకాన్ని చూసి పాప తృప్తిపడతాడు.

లోకాన్ని పరీక్షగా చూసేముందు తన ఒళ్లు తన స్వాధీనంలోకి రావాలి. అంతకు ముందు కోరినట్టుగా కాళ్లుచేతులూ పని చెయ్యవు. పొట్ట ఏంచెపితే దానికి శిరసా వహిస్తాడు. ఇంక అల్లా కాదు. మూడో నెల నించి ఎల్లాగైనా తన ఒంటిని చెప్పుచేతల్లో పెట్టుకోవాలని ప్రయత్నం ఆరంభిస్తాడు. ఇది క్రమక్రమంగా అలవాటవుతుంది. అన్ని అంగాలూ ఒక్కసారిగా స్వాధీనంలోకి రావు. కాబట్టి ఒక్కొక్కటొక్కటిగా స్వాధీన పర్చుకుంటాడు.

మొట్టమొదట బరువైన బుర్రతో ఆరంభిస్తాడు. క్రమంగా తరవాత చేతుల్ని నడుముని, కాళ్లని సాధిస్తాడు.

పుట్టినవెంటనే వాడికి తెలిసిన విద్య నోటితో కుడుచుకోవడం. బుగ్గ కేది తగిలినా సరే నోరు దానంతట అది తెరుచుకుంటుంది. వేలితో బుగ్గమీద చిటిక వేసేసరికి నోటితో అందుకోడానికి ప్రయత్నం చేస్తాడు. ఆహారపోషణలో తల్లి ఏంచేసినా చెయ్యకపోయినా వాడి పనికిమటుకు వాడు ఎప్పుడైనా సిద్ధమే. వాడెన్నడూ తన కర్తవ్యంలో లోపం చెయ్యడు. బుర్ర కదలకుండా పట్టుకోడానికి ప్రయత్నిస్తే వాడికి పిచ్చికోపం వస్తుంది. కీచుమంటాడు. ముఖం ఎర్రబడిపోతుంది,

పాపకి చూపు ఎప్పుడు అనుతుంది? చూడ్డం ఎప్పుడు ఆరంభిస్తాడు? చూపు కూడా నడకమాదిరిగానే క్రమంగా అలవాటు చేసుకుంటాడు. పాప తనవంక తదేకదీక్షగా చూసినప్పుడు తల్లి అకస్మాత్తుగా ఒకరోజు కనిపెట్టుతుంది. కాని ఈవిధంగా చూడ్డానికి పాప చాలరోజులుగా సాధన చేస్తున్నాడు. తల్లి కనిపెట్టడమే ఆలస్యమౌతుంది. పుట్టినవెంటనే బిడ్డకి వెలుగునీడల తేడా తెలుస్తుంది. మరీ ఎక్కువ కాంతి కంటిపైన పడితే పాప కళ్లు మూసుకుంటాడు. నుదురు ముడతలు పడతాయి. మొదటి వారాల్లోనే కంటికి సమీపంలో ఉండే వస్తువులపైన చూపునిలుపుతాడు. రెండుమూడు మాసాలు వచ్చేసరికి మనుషులముఖాల్ని గుర్తుపట్టగలుగుతాడు. గుర్తుపట్టి మాటలులేని తన వింత భాషలో పలుకుతాడు. 'మూడుమాసాలువెళ్లే సమయానికి బుర్ర అటూఇటూ తిప్పి చుట్టూ వస్తువుల్ని చూడ్డానికి ప్రయత్నిస్తాడు. చూపుసాధకంచేసే ఆరంభదినాల్లో పాప కళ్లు వింతగా ఉంటాయి. ఇంకా చూపుని గడించడం తెలియనప్పుడు రెండు కనుపాపలూ సరిగా ఉండవ్. ఒక్కొక్కప్పుడు మెల్ల కన్ను తెచ్చుకుని చూడ్డం కూడా ఉంటుంది. ఒక్కొక్కప్పుడు పాప చూపుచూస్తుంటే ఎదురుగా ఉన్నవారిని ముఖంలో చూస్తున్నాడా లేక మెడచూస్తున్నాడా అదీ కాకపోతే మనిషి వెనక ఉన్న గోడవంక చూస్తున్నాడా అనిపిస్తుంది. లేకపోతే తన ముక్కువంక చూసుకుంటున్నాడేమో. ఆరోజుల్లో కంటిపైన నీటిపొర కప్పినా నిశ్చింతగా ఉంటాడు. కంటిరెప్పలకి నూలు పోచ అంటుకున్నా వాడిచూపుకి అదేమీ అడ్డురానట్టుంటాడు.

పుట్టినమొదట ఒకటి రెండు రోజులు చెవుడున్నట్టుంటాడు. కాని వినికిడి రెండో రోజునించే ఉంటుంది. పెద్దధ్వని వినపడితే గజగజలాడిపోతాడు.

రెండుమాసాల వయసులో ఒకరోజున బిడ్డని చేతుల్లో పెట్టుకుని వాడికేసి నవ్వుతూ మాట్లాడుతున్నప్పుడు, ఉండుండి వాడు నవ్వడం మొదలెడతాడు.

మొట్టమొదటిసారి ఈ నవ్వు చూసే తల్లికి ఒళ్లు పరవశమౌతుంది. ఆ నవ్వు వాడి పెరుగుదలలో పెద్దమజిలీ అన్నమాట. ఆ సమయంలో వాడి కసలేవీ, తెలియదు. ఏమీ గ్రహించలేని స్థితిలో ఉంటాడు. వాడి చేతులు వాడి అధీనంలో ఉండవు. బుర్ర అటూ ఇటూ తిప్పలేడు. అయినా తల్లిని చూసి మహా తెలిసినట్లు నవ్వుతాడు. ఒక విషయంమాత్రం వాడికి తెలుసు. తనచుట్టూ తనని పలకరించేవాళ్లు ఎత్తుకుని ఆడించే వాళ్లు ఉండాలని వాడికి కోరిక ఉంటుంది. వాళ్లు నవ్వితే సమాధానంగా తాను నవ్వుతాడు. అంటే నలుగురిలో తనుకూడా ఒక సంఘజీవి అని తెలుసుకుంటూ దన్నమాట. ప్రేమతో ఆదరించేవాళ్లు వాడికి కావాలి. అమ్మదగ్గరకంటె అక్కదగ్గర ఎక్కువగా చేరతాడు. కాని ఆట్టే వాణ్ని తలపైన చెయ్యివెయ్యకుండా ఉండాలి వాడి ఆటపాటలకి అంతరాయం కలిగిస్తే తాడిప్రమాణాన్ని కోపంవస్తుంది. చేతులు రెండూ కలిపి పట్టుకుంటే వొదిలిందాకా మనకుండా కీచులాడతాడు. అంతకీ వదలకపోతే పెద్దఆపద సంభవించినట్లు ఏడుస్తాడు వాడి ఆటపాటలజోలికి పోకుండా ఉంటే ఎవర్ని చూసినా నవ్వుతాడు.

కొత్తవాళ్లదగ్గిర ఎల్లా ఉంటాడు? మాసాలు గడుస్తున్నకొద్దీ కొత్తవాళ్లపట్ల వాడి ప్రవర్తన మారుతుంది. రెండుమాసాల వయసులో వాడిని ఎత్తుకున్నవాళ్లు తల్లైనా సరే, తండ్రయినాసరే కొత్తవాళ్లైనాసరే వాడికి లెక్కలేదు. ఏడవకుండా ఉంటాడు. తల్లి నిమాత్రం కొంత కనిపెట్టగలడు. మూడోమాసంలో తాను నవ్వి అందర్ని నవ్విస్తాడు. తనవంక చూసి నవ్వనివాళ్లది పాపం, వెంటనే నవ్వుకి నవ్వు చెల్లించేస్తాడు. అందులోనూ ఆ నవ్వు డొక్కలో నించి బయలుదేరినట్లుంటుంది. గొంతుకలో కేరింత పిలిస్తే పలుకుతుంది. కాని అయిదో మాసం వచ్చేసరికి వాడి బుద్ధి మారిపోతుంది. కొత్తవాళ్లు సమీపించగానే కాళ్లు తన్నుకోవడం కేరింతలూ ఆపేస్తాడు. కాళ్ళు చేతులు కదపడు. సూటిగా అనుమానంతో చూస్తాడు. అల్లా పావునిమిషం చూసినతరవాత పొట్ట ఎగరేస్తాడు. కిందిపెదవి కొంతసేపు అల్లలాడించి, విరుచుకుని అప్పుడు ఏడుపారంభిస్తాడు. ఏడుపుకి ముందు పొట్ట ఎగరవెయ్యడం ఎంత ఎక్కువ ఎగరవేస్తే అంత ఎక్కువగా, ఆ కొత్తవాళ్లు వెళ్లిపోయినతరవాతకూడా ఏడుస్తాడు. సరిగ్గా ఈ వయసులోనే భయం అనేది బిడ్డని ఆవరిస్తుంది. అప్పుడు జాగ్రత్తగా ఉండవలసిన అవసరం ఉంటుంది. దణ్ణంపైన ఎర్రచీరో, గోడమీద బొమ్మ మొదలైనవి చూసి జడుసుకుంటాడు. ఒక్కొక్కప్పుడు తండ్రిని చూసే ఏడుస్తాడు. స్నేహితులెవరో కొత్తవాళ్లెవరో విచక్షణ చెయ్యగల వయస్సిది. భయపడే బిడ్డల్ని భయపడకుండా ఉంచాలి. అంటే ఆట్టే కొత్తవాళ్లని దగ్గరికి రానియ్యకూడదు. క్రమంగా కొత్తవాళ్లవద్ద అలవాటు చెయ్యాలి. అయితే

(33-వ పేజీ చూడుడు)

# "పిడుగుకూ-బియ్యానికీ"

శ్రీ సహజానందం



ఇటీవల పాకిస్తాన్‌లో చెలరేగిన మత దౌర్జన్య సందర్భంలో, పాకిస్తాన్‌కు ఇండియాకుమధ్య యుద్ధం రావటం అమెరికా - ఇంగ్లండులకు అభిమతమని మన కమ్యూనిస్టులు సిద్ధాంతం చేశారు. ఇండియా పాకిస్తాన్ యుద్ధంవలన అమెరికాకు ఏమి జరిగేదీ, ఇంగ్లండుకు ఏమి కలిసివచ్చేదీ వటుకు చెప్పరు.

ప్రపంచ లో ఎక్కడ ఏమి జరిగినా అది అమెరికా - ఇంగ్లండు కుట్ర అనే కమ్యూనిస్టు సిద్ధాంతమే పై అభిప్రాయానికి మూలం. రష్యనుకమ్యూనిజానికి అమెరికా బద్ధశత్రువు అనేది నిజం. ఆసియాలో రష్యా ఆట కట్టించాలని అమెరికా సంకల్పం. కాని ఇండియా పాకిస్తాన్ యుద్ధం మూలంగా ఈ సంకల్పం ఎలా సిద్ధిస్తుందో, ఈ యుద్ధంమూలంగా రష్యాకు అవరోధమెలా ఏర్పడుతుందో మనకు తెలియదు కమ్యూనిస్టులకే తెలియాలి. పాపం వారికీ తెలియకపోవచ్చు. అంతర్జాతీయ కమ్యూనిస్టు కేంద్రంనుంచి వినబడే బుర్రకథకు 'తానతందానా' అని అనటమేగా వీరి వంతు. ప్రపంచంలో చెడుఅంతకూ అమెరికా, ఇంగ్లండులు, మంచికి ఒక్కరష్యా అనేదే ఆ బుర్రకథ.

వెనకటికి ప్రకాశంప్రభుత్వం పతనమయ్యేసందర్భంలో కమ్యూనిస్టుల ప్రవర్తనకూడా ఈ సందర్భంలో గుర్తుకు వస్తోంది. ఏదో కాంగ్రెస్‌పార్టీలో గృహకల్లోలం అది అని ఇంకెవరైనా ఊరుకోవచ్చు. కాని రాజకీయాలను శాస్త్రీయంగా, హేతువాదంగా మథించే మన కమ్యూనిస్టులు అలా ఊరుకోరు.

ప్రకాశం ప్రధానిగా ఉన్నప్పుడు, గవర్నరు సర్ ఆర్చిబాల్డ్‌నై, తరచు రాష్ట్రమంతటా సంచారంచేస్తూ, ప్రజలతో సంబంధం కల్పించుకునేవాడు. (ఇప్పుడు గవర్నరు ఆ సంప్రదాయాన్నే అనుసరిస్తున్నాడు.) ఆ సంచారం నీకూ నాకూ పట్టి సంచారంగా మాత్రమే గోచరిస్తుంది. కాని కామ్రేడ్స్ వెంటనే ఆ సంచారంలోని గవర్నరుపన్నాగాన్ని బట్టబయలు చేశారు. ప్రజాప్రతినిధులైన మంత్రులను మద్రాసుసెక్రటేరియట్ లో బంధించి, వాళ్లను ప్రజలమధ్యకు వెళ్లనీయకుండా, తాను సంచారం చేస్తున్నాడు. ఇది బ్రిటిషువారి ఎత్తుల్లో ఒకటి. దేశీయనాయకులను ప్రజలనుంచి ఎడంచేయటం, తాము ప్రజాహితాన్ని కోరుతున్నట్టుగా నటించటమే ఆ ఎత్తు. పాపం ప్రకాశం గవర్నరు బొందలో పడిపోయాడు. అని అన్నారు కమ్యూనిస్టులు.

అంతటితో ఊరుకోలేదు. ప్రకాశం ప్రజారక్షకచట్టం - కాదు 'ప్రజాభక్షకచట్టం' - ఎర్రకలం ప్రకారం - అమలు జరిపాడు. ఇలాంటి ప్రజాభక్షకప్రభుత్వాన్ని పడదోయటం ప్రజాసేవ. అని కాంగ్రెస్ గృహకల్లోలంలో తాము కూడా ప్రమేయం కల్పించుకొని, ప్రకాశం ప్రభుత్వం పోవలసిందే అన్నారు. ప్రకాశం వ్యక్తిగా ఆ చట్టాన్ని పెట్టలేదని, కాంగ్రెస్ పార్టీ అధికారముద్రతో వ్యవహరించాడనేది శాస్త్రీయంగా రాజకీయాలను శోధించేవారికి అనవసరం. ప్రకాశంస్థానే రాబోయే కొత్తమంత్రివర్గం ఆ చట్టాన్నే అమలు జరుపుతుందనేది కూడా వారికి ప్రస్తుతం. ఆరోజుల్లో ప్రకాశం వ్యతిరేకులకు అనాయాచితంగా కమ్యూనిస్టుల సహకారం లభించింది. తర్వాత కథ మళ్లీ మామూలుపాటే. ప్రకాశంప్రభుత్వం పోయినా, కమ్యూనిస్టుల స్థితిగతుల్లో మార్పులు రాలేదు. గవర్నరు సంచారాలు ఆగలేదు.

అప్పటికీ ఇప్పటికీ ప్రజాభక్షకచట్టం కమ్యూనిస్టులను రెండుచేతులా ఆప్యాయంగా ఆహ్వానిస్తూనే ఉంది.

'ఆంగ్లో-అమెరికను' కుట్రసిద్ధాంతం ఒక్క కమ్యూనిస్టు మేధావుల్లోనూ, పండితుల్లోనూ మాత్రమే కాదు వ్యాపించింది. పల్లెటూళ్లలో కమ్యూనిస్టు సోదరులుకూడా నిమిషానికి ఒకటి రెండుసార్లు 'ట్రూమన్ కుట్ర' 'ట్రూమన్ కుట్ర' అంటూ వుంటారు. వాళ్లు నిజానికి ఒక్కొక్కప్పుడు కాంగ్రెసును చూసి కనికరిస్తూ ఉంటారు. పాపం కాంగ్రెసు ఏంచేస్తుంది? నెహ్రూ అట్లీ, ట్రూమన్ మాయలో పడిపోయాడు.

అమెరికా అనంగానే 'ఆటంబాంబు' గుర్తుకువస్తుంది. మరచాం. ఇప్పుడు 'ఆటంబాంబు' పోయి 'హైడ్రోజెన్' బాంబు వచ్చింది. ఈ 'ఆటంబాంబు' సందర్భంలో కూడా కమ్యూనిస్టులు 'సత్యం వద' అనే సూత్రాన్ని చాదస్తంగా దీక్షగా పాటించరు అనేది బోధపడుతుంది. అమెరికాయే ఈఘోరమైన మారణాస్త్రాన్ని అమానుషంగా జపాను ప్రజలపై ప్రయోగించిందని బాకాల్లోంచి, బాకాలు లేకుండానూ హోష పెట్టారు. కాని హిరోషిమా, నాగాసకీ పట్టణాలపై ఆటంబాంబులు విసరటానికి అమెరికా, ఇంగ్లండు, రష్యా మూడు దేశాలు ఒప్పుకొన్నాయనే విషయాన్ని చెప్పరు. హిరోషిమా, నాగాసకీ ప్రజలనలా చిత్రవధకు గురిచేయటంలో రష్యాకు కూడా పూర్తి బాధ్యత ఉంది. ఇది పాపం కమ్యూనిస్టులు వీలుగా మరచిపోతారు.

మన కమ్యూనిస్టులకు ఒక్కటే మంత్రం. పిడుగు బియ్యానికీ ఒకటే. అదేమంటే సర్వ సంఘటనలకూ 'ఆంగ్లో - అమెరికను' కుట్రలే కారణం అని.

---

కులాసా కబుర్లు :

# మంచాల సమ్మె

[ శ్రీ జి. యస్. సూరి ]

సమ్మెలు చేసేవాళ్ళందరూ సామ్యవాదులని అమాయకులం మనం అనుకుంటాము. అది కేవలం అపోహ అని న్యూజిలాండ్ దేశంలో ఒకమారుమూల గ్రామపు పడుచులు రుజువుచేశారు. సుత్తెకొడవళ్లు ఝళిపించే వారికే కాదు, సొగసులు కురిపించే మాకు కూడ సమ్మె సర్వరోగనివారిణి అని ఢంకా మీద బజాయించి మరీ నిరూపించారు.

అది యేదో ఒక నోరుతిరుగని ఊరు; పల్లెటూరికంటె పెద్దదీ, బస్తీకంటె చిన్నది అక్కడ ఆసుపత్రి అనేది ఏమీ లేదు కాని ఒక డాక్టరూ ఒక మంత్రసాని మాత్రము ఆ వూరిజనాభాను కనిపెట్టివుంటారు. పంచాయితీబోర్డులాంటి ఒక సంఘం వీరిద్దరికీ జీతాలు భత్యాలు ఏర్పాటుచేసి పోషిస్తూ ఉంటుంది. వ్యాధులపోర్టుఫోలియో డాక్టరుగారూ కాన్పులడిపార్టుమెంటు మిస్సెమ్మగారూ పోటీ అంటూ లేకుండా నిభాయిస్తూ ఉంటారు.

ఆ మిస్సెమ్మ సామాన్యురాలుకాదు; కేవలం నడమంత్రపు మంత్రసాని. చెప్పాలో తగిన హస్తవాసి మహాతల్లిది, ముస్తాబు కావటంలో కనబరచే మెళుకువలో పాతిక పాలు కాన్పులు చేయటంలో చూపగలిగితే ఆ వూరిజననమరణచిట్టాలు మరోకవిధంగా ఉండేవి. పనిలోకంటె మాటలో చురుకు ఎక్కువ. ఇటు చేతగానితనానికీ అటు నోటిదురుసుకూ ఆవూరి ఇల్లాళ్లు ఉక్కిరిబిక్కిరి అయినారు. ఈ యమధర్మరాజు సోదరిని జ్ఞప్తికి తెచ్చుకునేటప్పటికి, సంతానంమీద మోజు అంతర్ధాన మయేది.

ఇంత అసమర్థపు మంత్రసానిని ఆమహిళాలోకం ఎందుకు వెంటనే వదలించుకోలేదా అని మీకు ఆశ్చర్యం వేయువచ్చు. అక్కడే ఉన్నది. చిత్రమంతా. ఆవిడకు ఉద్యోగరీత్యా ఉన్న లోపం ఆకారరీత్యా తీరింది. ప్రసవానికి ఉపకరించే మెళుకువలు తెలియకపోయినా సౌందర్యపోషణకు కావలసిన కిటుకులన్నీ ఆమెదగ్గర ఉన్నవి. అందుచేత పంచాయితీబోర్డు సంఘంవారిమీద సమ్మోహనాస్త్రం ప్రయోగించి ఉద్యోగం నిలుపుకోటానికి మంచి కట్టుదిట్టాలు చేసింది.

అదృష్టవశాత్తూ, ఏదో సరదా పుట్టి మూడు నెలలపాటు శెలవుపెట్టి దేశాంతరాలను చూడబోయింది ఈ మిస్సెమ్మ. ఆవిడ స్థానంలో మరోక ఊరినుంచి ఒక నర్సును ఆక్టింగుగా నియమించారు ఈమెకు ఉన్న ఒడుపుయావత్తూ కాన్పులు చేయటంలో తప్ప మరెందులోనూ లేదు. ఎంతో జాయలాపాయలాగా ప్రసూతి వైరాగ్యం ఏ చూలాలికీ కలుగకుండా సుఖప్రసవం చేయించి తియ్యనికబుర్లు చెప్పి, ఆ వూరి స్త్రీలలందరికీ అతిత్వరలో ఎంతో ఇష్టురాలు అయింది.

ఇంతలో మూడుమాసాలూ ఇట్టే వెళ్లిపోవచ్చినవి. డ్యూటీలో చేరటానికి నడమంత్రపు మంత్రసాని ప్రత్యక్షమయింది. ఇక మూడురోజులలో ఆక్టింగు నర్సు వెళ్ళిపోవటానికి సిద్ధమవుతున్నది. అంతకాలంనుంచీ ఈ విషయంలో ఏమీ చేయజాలని అబలలందరూ ఒక్కసారి విజృంభించారు. పాత మంత్రసానికి అంపకాలు చెప్పి ఆక్టింగు నర్సును పర్మనెంటు చేస్తేనేతప్ప ఊరిలో ఇక కాన్పులనేవి జరగటానికి ఎంతమాత్రం అవకాశం లేదని మగవారందరికీ, తద్వారా పంచాయితీబోర్డుకూ, మూజువాణీ నోటీసులు జారీచేశారు.

వాళ్ళముఖం లే అని చిరునవ్వులు నవ్వారు మగవారంతా, ఇటువంటి బెదరింపులకు లొంగిపోతే మగవారిప్రతిష్ఠ మట్టిపాలు కాదా అని బోర్డుసభ్యులు భుజాలు ఎగరేశారు. పాతమిస్సెమకు స్వాగతం ఇచ్చినవి పుల్లింగాలు; కొత్త మిస్సెమ్మకు వీడ్కోలు ఇచ్చినవి స్త్రీలింగాలు.

ఆ నాటిరాత్రినుంచీ ప్రతిపడకటింటిలోనూ అపూర్వమైన మార్పు ఒకటి జరిగింది ఒకే మంచం ఉన్నగదులలో రెండవమంచం తయారయింది. అదివరకే రెండుమంచాలున్న కొంపలలో మంచానికీ మంచానికీ మధ్య బారెడు ఖాళీ ప్రత్యక్షమయింది. ఆ తరువాత ప్రతిరాత్రీ సంభాషణ దాదాపు ఈ విధంగా ఉండేది.

తూర్పుమంచం:- "ఇదిగో నిన్నే."

పడమటిమంచం:- "......" (నిశ్శబ్దం)

తూ. మం:- "పిలుస్తుంటే పలకవేం !"

ప. మం:- "..............."

తూ. మం:-"నీ కొక రహస్యం చెప్పాలి"

ప. మం:- ".............."

తూ. మం:- "నాకేదో జ్వరం తగిలినట్లున్నది. చూసి పోవోయ్."

ప. మం:- "..............."

తూ. మం:- "ఓహోయ్, నిన్నేనోహోయ్ !"

ప. మం:- [కఠినంగా] ఏమిటా సవారి మోతలూ ? చాకిరి చేసిచేసీ ఏదో కన్ను మూస్తుంటే ఏమిటీ అంకమ్మశివాలూ ! మాట్లాడకుండా పడుకోలేరూ ?"

తూ. మం:- [నిశ్శబ్దం]

ప. మం:- [నిశ్శబ్దం]

[నెమ్మదిగా తెరపడును]

ఈ విధంగా దాదాపు ఆరువారాలు గడచినవి. విరోధివర్గం లొంగిపోతుందేమో నని పోతుపేరంటాళ్లు ఎంత కనిపెట్టి ఉన్నా పురి పెరగటమే గాని తరగటం ఎక్కడా కనపటలేదు. పైగా రాత్రిపూటవి రొసరొసలు తెల్లవారితే మాయం కాకుండా బెజవాడలోని వడగాలిలాగా రాత్రింపవళ్లూ అనంతంగా తయారైపోయినవి. ఆఫీసులలోను, పానశాలలలోను, క్లబ్బుల్లోను గృహాధ్యక్షులంతా గూడుపుఠాణీలు జరిపారు. మంతనాలు చేశారు. ప్లాన్లు వేశారు. ఉమ్మడిగా ఒక రోజున పంచాయితీబోర్డువారిదగ్గరకు

(౩౩-వ పేజీ చూడుడు)

**సంగీతము:**

# రాగాలాపన పద్ధతి

## పూర్వ సాంప్రదాయము, ఈనాటి అనుసరణ

భారతీయుల సంగీతసాంప్రదాయమునందలి విశిష్టత అందుగల రాగాలాపనవిధానమే యగును. ఇతరకళలకువలెనే ఈ సంగీత కళకుకూడా లక్ష్యము బ్రహ్మానందానుభవమే. ఇట్టి ముఖ్యలక్ష్యమును సాధించుటకొరకై ఆకళయందు ఎట్టి యవక్రతలును భిన్నభిన్న వ్యక్తులవలన కలుగకుండుటకైమన పూర్వపు సంగీతాచార్యులు కొన్ని నియమబద్ధమగు పద్ధతులను ఏర్పరచి యున్నారు. ఇతర యోగాదిసాధనలవల్ల బ్రహ్మానందానుభవము ఎటుల కలుగుచున్నదో అటులనే మన పూర్వాచార్యులు ఏర్పరచిన సాంప్రదాయానుసారముగా రాగాలాపనము చేస్తే అట్టి యానందానుభవం తప్పక కలుగుతుందని చెప్పారు. దీనికి సందేహం లేదు.

ఈరాగాలాపన మనునది సాహిత్యములేనట్టి సంగీతనాదోపాసనయని చెప్పదగును. పాతంజలియోగసూత్రానుసారముగా హఠయోగులు కుండలినిని మేల్కొలిపి మూలాధారంనుంచి సహస్రారమువరకును ఎటుల తీసుకొనివెళ్లుదురో (సంచరింపచేయుదురో), తద్వత్తుగనే ప్రసిద్ధుడైన గాయకుడు సాంప్రదాయబద్ధమగు రాగాలాపనంచేత ననగా స్వరప్రస్తార క్రమంగా జాతిమూర్ఛనాదిభేదముల నెఱింగి రాగమును ఆలాపనము లేక సంచారము నొనర్చి తన లక్ష్యమును సాధించుచున్నాడు.

పూర్వనియమబద్ధమైన (సాంప్రదాయానుసరణము) రాగాలాపన మెటులనో కొంత విచారింతము ;—

> యోఽయం ధ్వనివిశేషస్తు
> స్వరవర్ణవిభూషితః,
> రంజకో జనచిత్తానాం
> సరాగః కథితోబుధైః. (సం॥ ర)

అనగా రాగము స్వరవర్ణములచే నలంకరింపబడి జనుల చిత్తములను ఆనందింపజేయునది రాగము అని చెప్పబడుచున్నది. ఈరాగముస్థాయి, ఆరోహి, అవరోహి, సంచారి యని నాల్గువిధములుగా చెప్పియున్నారు. మరియులు ఈరాగమునకు కొన్ని (త్రయోదశీ) లక్షణములను చెప్పియున్నారు.

> "గ్రహాంశతారమంద్రాశ్చ
> న్యాసాపన్యాసయో స్తథా,
> అపిసన్యాసవిన్యాసౌ
> బహుత్వం చాల్పతా తతః.
> ఏతాన్యంతరమార్గేణ
> సహాలక్ష్యాణిజాతిషు,
> షాడవౌడువేతిక్వాపి
> త్యేవమాహుస్త్రయోదశా.
> (శార్ఙ్గదేవుని. సం. ర) :

గ్రహ, అంశ, తార, మంద్ర, న్యాస, అపన్యాస, సన్యాస, విన్యాస, బహుత్వ, అల్పత్వ, అంతరమార్గ, షాడవ, ఔడువము లని. పదమూడు లక్షణములను చెప్పియున్నారు. తరువాత రఘునాథనాయకుడు తన "సంగీతసుధ" అనే గ్రంథములో కూడా

**శ్రీమతి జె. కమలాదేవి**

ఈ 13 టినీ చెప్పియున్నాడు :-"శ్లో॥ గ్రహాభిధానః ప్రథమః...............త్రయోదశ స్యాత్ పునరౌడు వాచ్యః" అని నిరూపించాడు - కాని అనంతరం వెంకటముఖి వీటి నన్నింటినీ పరిశీలించి పదిలక్షణములను మాత్రమే చెప్పియున్నాడు. చిట్టచివర చెప్పబడిన అంతరమార్గ, షాడవ, ఔడువము లనునవి వేరువిధములగు జన్యరాగము లగుటవలన ఆ మూడింటిని ఇందు చేర్చక వేరుగా లక్షణము చెప్పియున్నాడు. చతుర్దండి ప్రకాశికలో "గ్రహాంశౌ మంద్రతారౌ చన్యాసాపన్యాసకౌతథా, అథ సన్యాస విన్యాసౌ బహుత్వం చాల్పతాతథా లక్షణాని దశైతాని రాగాణాం మునయో బ్రువన్" అను శ్లోకముల చూడదగును.

ఈ రాగాలాపనమును "ఆలప్తి" యని అందురు.

> "శ్లో॥ తత్రాలాపేషు సర్వత్రా
> ప్యాదావాక్షిప్తికాస్మృతా
> ఆక్షిప్తికైవలోకేస్మిన్
> ఆయిత్త మితి గీయతే"......"

అని చెప్పారు. అంటే రాగాలాపనలో ప్రథమముగా ప్రయత్నించేదాని "ఆక్షిప్తక"అని అంటారు. దీనినే "ఆయిత్తని" మనికూడా . అంటారు. దీనికి ఒక క్రమ విధానమును నిరూపించారు. అదేమన :

ఆక్షిప్తకము:—

రాగమును ప్రారంభించునపుడు మొదట మధ్యస్థాయి షడ్జమును ఆక్షిప్తకగాగాని మంద్రస్థాయియందును, మధ్యస్థాయి ఋషభ, గాంధారస్వరములలోపలను గాన క్రియ నొనర్చి, ఆ రాగలక్షణముల ననుసరించిన్నీ, గాయకునియొక్క శక్తి ననుసరించిన్నీ, తారస్థాయి ఋషభ, గాంధార, మధ్యమ, పంచమస్వరములవరకుకూడ నొకసారి రాగమును సంచారంజేసి తిరిగి క్రమముగా మధ్యస్థాయి షడ్జమునకు వచ్చి పూర్తి చేయవలెను. ఇటుల త్రిస్థాయిలయందును, స్వల్పముగ రాగముల సంచరించుటను "ఆక్షిప్తకాలాపన"అనియు, "ఆయిత్తము" అనియు నందురు. దీనికి తరువాత రాగాన్ని విపులముగా పాడుటను ."రాగవర్ధని"అని అంటారు. (దీనినే "ఎడుప్పు"అని తమిళంలో అంటారు.) రాగవర్ధని యనగా రాగమును పెంచుట యని యర్థము. ఇది నాలుగు విధములుగా చెప్పియున్నారు. ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, రాగవర్ధను లందురు. ఈ రాగవర్ధనులను అంతమునను ముగించునట్టి క్రియలకు, "ముక్తాయి"లనీ, లేక "విదారుల"నియుకూడ చెప్పుదురు. ఇవియును ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ విదారు లని నాల్గు గలవు.

రాగవర్ధనులు :—

ప్రథమరాగవర్ధని క్రమము : — మొదట రాగమును మధ్యషడ్జమున ప్రారంభించి పైన చెప్పబడిన న్యాసాంశాదిలక్షణములు చెడకుండను ; వివాదిదోషములు రాకుండను ; రక్తి చెడకుండునట్లుగను, గమకములను ఉచిత రీతిగా నుపయోగించుచూ, మంద్రస్థాయిలో ఉపన్యాసక్రమము చెడకుండ, విలంబ కాలము (చౌకకాలము) తోనే పాడుచూ, అప్పుడప్పుడు మధ్యమకాల సంగతుల నిముడుస్తూ ; అనంతరం మధ్యస్థాయియందును

(34-వ పేజీ చూడుడు)



p.18



పారమౌంట్ వారి "వారసురాలు" చిత్రంలో నాయికా నాయక పాత్రధారులు, ఒలీవియా డి హావిలండ్, మాంట్‌గామరీ క్లిఫ్ట్.

<u>సినిమా</u> :

# 'వారసురాలు'
# (HEIRESS)

మానవసహజమైన దౌర్బల్యాన్ని సహజంగా చిత్రించే కొద్దిసినిమాల్లో పారమౌంట్ పిక్చర్స్‌వారి "వారసురాలు" అనే ఇంగ్లీషుసాంఘికచిత్రం ఒకటి. ఈ చిత్రానికి ఇతివృత్తం హెన్రీజేమ్స్ వ్రాసిన "వాషింగ్‌టన్ స్క్వేర్" అనే నవలనుంచి గ్రహించబడింది. ఈకథ, అనేకమాసాలు బ్రాడ్వేథియేటర్లలో (న్యూయార్కు) ప్రదర్శించబడింది. పాశ్చాత్యుల సమాజంలో తరుచు ప్రత్యక్షమయ్యే ప్రేమ వివాహాలసమస్యలలో ఒకటి ఈ కథలో యథాతథంగా చిత్రించబడినందువల్ల అక్కడ ప్రజల ఆదరణ పొందింది. 1949 లో ఈ నాటకాన్నే ప్రఖ్యాతహాలీవుడ్ దర్శకుడువిలియం వైలర్ పారమౌంట్‌పిక్చర్స్‌వారి ఆధ్వర్యంలో ... చిత్రంగా తీశాడు. ఈ చిత్రంలో వారసురాలుగా నటించిన ఒలీవియా హావిలండ్ ఆస్కార్ బహుమతి పొందింది. ఈ చిత్రంలో విశేష మేమిటంటే కథలో మనుషులు సహజంగా ఉంటారు. అభూత కల్పనలు లేవు. సన్నివేశాలు కొద్ది. కాని సంభాషణల్లో పాత్రపోషణకు ప్రాధాన్యమిచ్చి చిత్రాన్ని మంచిపట్టులో నడిపించారు. అందవిహీనురాలుగా, అమాయికగా అవివేకిగా ఒలీవియా చేసిన అభినయం సహజంగా ఉంది.

కూతురు కాథరిన్‌కి (ఒలీవియా డి హావిలండ్) బొత్తిగా నలుగురిలో ఎలామెలగాలో తెలియదు. తండ్రి డా॥ స్లోపర్ (సర్ రాల్ఫ్ రిచర్డ్‌సన్), మేనత్త లావినియా (మిరియమ్ హాప్కిన్స్) ఆమెకు మాటకారితనం నేర్పాలనీ, చక్కగా అలంకరించుకోడం నేర్పాలనీ ఎంత కృషిచేసినా ఫలించలేదు. చదువు చెప్పించబోతే అక్షరం అంటలేదు. ఇంక ఆమెకు తెలిసినదల్లా ఎంబ్రోయిడరీ మాత్రమే. తల్లి పోయినప్పుడు సాలీనా పదివేల డాలర్ల ఆదాయానికి వారసత్వం ఇచ్చింది. అదికాక తండ్రి గడించిన అపారసంపద ఉన్నాయి. అయినా ఆమెకు వరుడు రాలేదు. నిత్యం జరిగే విందుల్లోనూ నృత్య వినోదాలలోనూ అందరు యువతులమాదిరిగా యువకులతో స్నేహంచేసుకునే ప్రజ్ఞ ఆమెకు లేదు. కొత్తవాళ్లతో మాట్లాడ్డం బొత్తిగా చేతగాదు. అలంకరణలో రీతి తెలియదు. ఎంత వయసు వచ్చినా మేనత్త సహాయం తప్పనిసరయింది తలిదండ్రుల అజమాయిషీలోనే పైనప్పటికీ రూపంవల్ల,



"వారసురాలు" చిత్రంలో ఒక సన్నివేశం. తండ్రి సూచనపైన, వివాహవిషయం నిర్ధారణ చేసుకోడానికి ముందు, యూరప్ సంచారానికి వారసురాలు బయలుదేరుతున్న దృశ్యం

నాలు కారితినందువల్ల అభిజాత్యంవల్ల యువతీ యువకులు పరస్పరం ఆకర్షించుకుని వివాహాలు చేసుకునే పాశ్చాత్యసమాజవ్యవస్థలో ఈ వారసురాలికి వివాహం ఘటిల్లదని తండ్రీ మేనత్తా బెంగపెట్టుకుంటారు.

కాని కాథరిన్‌వద్ద ధనాకర్షణ ఉంది. యూరప్ సంచారం చేసివచ్చిన ఒక యువకుడు థామ్సన్ (మాంట్ గామరీ క్లిఫ్ట్) ధనాశతో కాథరిన్‌వద్ద ప్రేమ నటిస్తాడు. ప్రేమించే యువకు డొకడు దొరికేసరికి కాథరిన్ పరమానందభరితురాలౌతుంది. అతన్ని కలుసుకున్న రెండోరోజునే వివాహం చేసుకోడానికి అంగీకరిస్తుంది. యువతి ఆకర్షించాలే కాని వివాహం చేసుకోడానికి తొందర ప్రకటించకూడదనే నియమం ఆమె పాటించలేదు తండ్రి ఆమెను తొందరపడవద్దని హెచ్చరిస్తాడు కాని మేనత్త కూడా తొందరపడుతుంది మర్నాడు ఉదయం తండ్రి థామ్సన్ సోదరిని రప్పించి అతన్ని గురించిన వివరాలు తెలపమంటాడు కాని సోదరి తమ్మునిలోని లోపాల్ని చెప్పలేదు తండ్రి కాథరిన్‌ను పిలిచి థామ్సన్ సోదరికి చూపుతాడు కాథరిన్ అమాయకత్వం, ఆమెకు బోధపడుతుంది ఈవిషయంలో తానేమీ చెప్పలేనని సోదరి చెప్పింది తన తమ్మునిలో లోపాలున్నప్పటికీ లోపాలతోనే అతన్ని తమ్మునిగా స్వీకరించి ఆదరిస్తున్నట్లు మాత్రం చెప్తుంది థామ్సన్ భోగవిలాసాల్ని అతని సోదరికంతో పోల్చిచూస్తాడు డా॥ స్లోపర్ పెంచి పెద్దవాడిగాచేసిన సోదరినే థామ్సన్ ఆదరించడం లేదని డాక్టర్‌కి అర్థమయింది. థామ్సన్ సోదరి వెళ్లిపోయిన కొద్దిసేపట్లోనే థామ్సన్ వస్తాడు కాథరిన్‌తో తన వివాహాని కంగీకరించవలసిందని డా॥ స్లోపర్‌ని అర్థిస్తాడు డాక్టర్ నిరాకరిస్తాడు కాని కాథరిన్ తాను వివాహం చేసుకోడానికి నిశ్చయించినట్టు చెప్తుంది ఆరుమాసాలపాటు యూరప్‌సంచారం చేసివచ్చినతరవాత వివాహవిషయం యోచించవచ్చని తండ్రి సూచిస్తాడు. థామ్సన్ వలనైనా కాథరిన్ అంగీకరిస్తుంది. కాని యూరప్ సంచారంలో కాథరిన్ మనసు మార్చుకోలేదని తండ్రికి బోధపడుతుంది ఆరునెల్లూ కాకముందే ఇంటికి తిరిగివస్తారు తిరిగి తండ్రి కాథరిన్‌ను హెచ్చరిస్తాడు థామ్సన్ నిజంగా ఆమెను ప్రేమించడం



శ్రీ పృథ్వీరాజ్ కపూర్‌కు ఏలూరు పౌరుల స్వాగతమిచ్చారు.

లేదనీ ఆమెధనాన్నిమాత్రమే ప్రేమిస్తున్నాడనీ చెప్తాడు కాని ఆమె నమ్మదు కోపంతో తండ్రి కుమార్తెను దూషిస్తాడు. ఆమెవద్ద ఏమిఉందని థామ్సన్ పెళ్లిచేసుకో గోరుతున్నాడు? అందవికారి, అవివేకి అని దూషిస్తాడు ఆమె తండ్రిని సరిగా అర్థం చేసుకోలేకపోతుంది చివరికి విసుగెత్తి తన సంపదల్ని ఆమెకు చెందకుండా చెయ్యగలనని తండ్రి బెదిరిస్తాడు. కూతురు తండ్రిపైన ద్వేషం వహిస్తుంది తనను తండ్రి ద్వేషిస్తున్నాడని మేనత్తతో చెప్తుంది తనకు తండ్రిభాగ్యం అవసరం లేదనీ, తనకు వచ్చే పదివేల డాలర్ల సాలీనా ఆదాయం తనకు చాలుననీ, తండ్రి అనుమతి లేకపోయినా తాను థామ్సన్‌తో లేచిపోయి వివాహం చేసుకో దలిచిందనీ మేనత్తకు తెలుపుతుంది ఆరాత్రి థామ్సన్‌తో రహస్యంగా మాట్లాడుతుంది ఆ రాత్రే తనను తీసుకుపోవలసిందని కోరుతుంది థామ్సన్ అంగీకరిస్తాడు కాని తండ్రి ఆస్తి కూతురికి చెందదని తెలియగానే మనసు మార్చుకుంటాడు అర్ధరాత్రి బండితోవచ్చి ఆమెను తీసుకుపోగలనని వాగ్దానమిచ్చి వెళ్లిపోతాడు రాత్రంతా ఆమె థామ్సన్‌కోసం నిరీక్షించి, అతను రాకపోయేసరికి అర్థం చేసుకుంటుంది.

తండ్రిభాగ్యం తనకు చెందదనే విషయాన్ని థామ్సన్‌కి తెలపడం తెలివితక్కువ అని మేనత్త అంటుంది థామ్సన్ తిరిగి కనిపించడు అతడు కాథరిన్‌తో చెప్పకుండా కాలిఫోర్నియా వెళ్లిపోతాడు

కాథరిన్ తండ్రిపైన పగబట్టి మాటలు మానుకుంటుంది తండ్రి అనారోగ్యంతో బాధపడుతున్నప్పుడు ఆదరించదు

తండ్రి మరణించినప్పుడు భాగ్యమంతా ఆమెకే ఇచ్చినా ఆమె ఆఖరిసారైనా అతనిని చూడదు తానింక వివాహంలేకుండా ఉండిపోవాలని నిశ్చయించుకుంటుంది తండ్రి మరణించిన కొన్నేళ్లకి థామ్సన్ తిరిగివస్తాడు. అంతరాయం తొలగిపోయినందువల్ల ఇప్పుడు వివాహం చేసుకోడానికి వచ్చినట్లు చెప్తాడు. ఆనాడురాత్రి వాగ్దానభంగం చెయ్యడానికి, చెప్పకుండా కాలిఫోర్నియా పారిపోవడానికి ఆమె మేలుకోరడమే హేతువని చెప్తాడు తండ్రిఆస్తి ఆమెకు సంక్రమించకపోతే ఆమెకు నష్టం వాటిల్లుతుందనీ, అందువల్ల ఆమెమేలు కోరి తాను దూరంగా వెళ్లిపోయినాడనీ చెప్తాడు. కాని ఆమె అతని అంతర్యాన్ని గ్రహించింది థామ్సన్‌ను వెళ్లగొట్టుతుంది కాథరిన్ వివాహం లేకుండా ఉండిపోతుంది

# ఆంధ్రగ్రంథాలయ మహాసభలు - సూర్యా



(1) శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు—ఆం. గ్రంథాలయసంఘం అధ్యక్షులు, (2) శ్రీ ప్రతాపగిరి రామమూర్తిగారు—మహాసభ అధ్య
(3) శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు—ఆం. గ్రం. సంఘం స్థాపకులు, (4) శ్రీ కోదాటి వెంకటేశ్వరరావుగారు—ఆహ్వానసంఘాధ్యక్ష



(1) శ్రీ కోదాటి నారాయణరావుగారు—ప్రచురణశాఖాధికారి, (2) శ్రీ మాగెపల్లి రామచంద్రశాస్త్రిగారు—ఆం. గ్రం. సంఘం ఉపాధ్య
(3) శ్రీ కొమ్మ సీతారామయ్యగారు—కోశాధిపతి, (4) శ్రీ ఫజలుర్రహమాన్ గారు—మహాసభ ప్రారంభకులు



(1) శ్రీ పాతూరి నాగభూషణంగారు—కార్యదర్శి—(2) శ్రీ నరేంద్రుల మాణిక్యరావు, శ్రీ చకం శ్రీనివాసరావుగార్లు—ఆహ్వానసంఘ కార్యద
(3) శ్రీ యం. జె. ప్రకాశంగారు—వయోజనవిద్యాసభ అధ్యక్షులు—(4) శ్రీ ఇటికాల్యల మధుసూదనరావుగారు—వాలంటీరు దళాధి



గ్రంథాలయ మహాసభ ప్రతినిధులు





శ్రీ సర్వోత్తమరావుగారు
ప్రదర్శనాన్ని ప్రారంభిస్తున్నారు.

# హరిద్వార్ కుంభమేళ ఉత్సవాలు



హరిద్వారంలో కుంభమేళ పర్వదినాన (ఏప్రిల్ 18) యాత్రికులు 'హర్‌కీపౌరీ' అనే ఘట్టంలో దిగి స్నానం చేస్తున్నారు.



కుంభమేళ సమయంలో ఢిల్లీ సిక్కులు భారతాధ్యక్షునికి 'తల్కాతోరా' పార్కులో సన్మానంచేశారు. ఫోటోలో డా॥ ప్రసాద్, పండిట్ నెహ్రూ, బల్దేవ్ సింగ్, పాటియాలా రాజప్రముఖ్, పాటియాలా తూ. పం. సంస్థాన సమాఖ్య ప్రధాని ఉన్నారు.




# "అమ్మ కొట్టింది"

అప్పుడప్పుడు నాన్న నన్ను కొడతాడు. అమ్మకూడా కొడుతుంది. ఒకళ్ళు కొట్టినప్పుడు రెండో వాళ్ళు "పిల్లలను ఎప్పుడూ కొట్టకూడదనే" అంటారు. ఇద్దరూ "ఒళ్లు మండుకు వచ్చి కొట్టా"మంటారు. ఏమన్నా పిచ్చిఎత్తి కొట్టాంటారో ఏమో! మరి. వాళ్ళిద్దరూ-నేను ఒక్కతెనే ఆయెను.

పొద్దున్న లక్కపిడతలూ అవీ తీసుకొని మధ్యగదిలో బొమ్మరింట్లో ఆడుకొంటూ కూర్చున్నాను. అన్నం వండుకొనేందుకు సెనగపప్పు పెట్టమంటే అమ్మ పెట్టనంది. గోధుమపిండి అందకుండా పైన ఎక్కడో పెట్టింది. పంచదార కూడా పెట్టలేదు. బొమ్మపొయ్యి మీద పెనం పెట్టాను. కాలిన అగ్గిపుల్లలు అమ్మ ఎక్కడెక్కడో పారేస్తుంది. పొయ్యిలో పెడదామంటే ఒకటీ కనబడలేదు. పోనీ అని చీపురుకట్ట తెచ్చి విప్పి, చిన్న చిన్న కట్టెపుల్లలు చెయ్యటం మొదలెట్టాను.

"ఏమిటే; ఇంటినిండా ఆ పెంట" అని అమ్మ ఒక్క కేక పెట్టి నాబుగ్గగిల్లి, చీపురుకట్టకాస్తా లాక్కుపోయింది. అక్కడికీ నేను ఏడవనే లేదు.

పోనీలే అని లాంతరుదగ్గరకు వెళ్ళి నిప్పపెట్టె తెచ్చి ఆ పుల్లలే ఇన్ని పొయ్యిలో పెట్టాను. పొయ్యిలో ఆట్టే అన్నీ పట్టనేలేదు. తక్కినవి పెట్టెలోనే ఉంచేశాను. ఒకపుల్ల గీస్తే వెలగలేదు. ఇంకో పుల్ల గీస్తే ఇట్టే బుస్సుమని వెలిగింది. నాకు భయమేసి ఆతల పారేశాను.

అమ్మకు మరీ బద్ధకం. పాతగుడ్డలన్నీ నా బొమ్మరిల్లుదగ్గరే పారేస్తుంది. అవి పరుగెత్తుకొనివచ్చి

'పాపాయి'

నిప్పుపుల్లమీద పడ్డాయి. లేకపోతే నిప్పుపుల్ల నే నటు విసురుతానా ఏమిటి! అక్కడికీ వెంటనే అమ్మను కేకవేశాను. ముందు నాన్నే పరుగెత్తుకొచ్చారు. బూట్లతో గుడ్డల మీద తొక్కి ఆర్పేశారు. వెధవ గుడ్డలు సరిగ్గా మండనైనా మండ లేదు. నాన్న నన్నూ అమ్మనూ తిట్టారు. "అబ్బ వెధవ అల్లరి ఏదీ నిలవనివ్వవే" అని రెండు తిట్టి "అయినాకానేపు పిల్లను అవతల ఆడించ రాదూ, వంట అయే లోపలా!" అంటూ నాన్నమీద సణిగింది అమ్మ. నాన్నకు మరీ కోపం వచ్చింది. ఎవళ్ళ దోవను వాళ్ళు వెళ్ళారు.

రొట్టెలు చేద్దామంటే పిండి కనబడలేదు. దొడ్లోకి వెళ్ళి పొడి మన్ను తెచ్చాను. తడుపుదామంటే నీళ్ళు లేవు. వంటింట్లోకి లక్కపిడత తీసికెళ్ళి బిందెలో నీళ్ళు తెచ్చాను. కారపుడబ్బా కాలికి తగిలి నీళ్ళు ఒలికాయి. డబ్బాడు కారం అంతా అక్కడే నీళ్ళలో ఒలికింది.

లక్కపిడతలో నీళ్ళు చాలవు, పల్ఫుమీద గాజుగ్లాసు వుంది. అది అందుకొందామని కుర్చీపీట దానిదగ్గిరికి లాగాను. కుర్చీపీట మీద బియ్యం చేట పెట్టుకుంటారా ఎవరన్నా? చేట క్రింద పడి బియ్యం కింద ఒలికాయి. జల్లెడ దొర్లిదొర్లి వెళ్ళి గుమ్మంలో పడింది.

కుర్చీపీట వేసుకొని గ్లాసు తీస్తున్నాను. ఇంట్లోకి వస్తూ జల్లెడ కాళ్ళలో పడి అమ్మ ముందుకు జారింది. "ఏం చేస్తున్నావే" అంటూ ఒక్క కేక పెట్టింది. నా చేతిలో గాజుగ్లాసు క్రింద పడింది. అల్లా కేకవేస్తే నాకూ [illegible] పుట్టదూ! కుర్చీపీటమీదనుంచి నేను పడ్డాను. అయినా; ఏడవకుండా, నెమ్మదిగా గాజుముక్కలు ఏరుదామని ఎత్తుతూన్నాను.

**మరి ఎందుకు కొట్టిందో, అప్పుడే**

పిచ్చి ఎందు కెత్తిందో అమ్మనా వీపు మీద రెండేసింది. నాకు నొప్పి పెట్టి గట్టిగా అరిచాను. అంతేగాని అది ఏడవటమూ ఏమిటి? నాన్న గబగబా లోపలికివచ్చాడు. "పిల్లని కొట్టొద్దని ఎన్నిమాట్లు చెప్పినా నీకు బుద్ధి లేదేం"అని అమ్మను తిట్టి నన్ను ఎత్తుకొని ముందుగదిలోకి తీసికెళ్ళాడు.

మరి నాన్నమాత్రం ముందు చూసుకోవద్దూ—రొట్టికోసం మట్టి తెచ్చుకొన్నానుగదా చేతికి మట్టి ఉండదూ?—అది తన ఇస్త్రీచొక్కాకు అంటుకొందిట—"ఛీ ఛీ ఏంపనులే పాడుపనులూ, మట్టి ముట్టుకోవద్దని చెప్పలా; అఫీసుకు ఇంకో చొక్కాకూడా లేదాయిరి తగలేసి!" అంటున్నాడు.

నేను బిక్కమొగం పెట్టనేలేదు మొగం అల్లా ముడుచుకుందికాబోలు. "పోనీలే అమ్మా ఏడవకు" అంటూ పిప్పరమెంటుబిళ్ళ పెట్టి, తను రేడియో బాగుచేసుకొంటూ, "చూస్తూ, కూర్చో అమ్మా!" అంటూ ప్రక్కనే కూర్చోబెట్టాడు.

ఆ రేడియోవెనకాతల అంతా గాజుబుడ్లు ఉన్నాయి. "వెధవది వెలగటంలేదేం," అంటూ నాన్న కొయ్యపిడి ఉన్న చాకుతో లోపలి తీగలన్నీ చూస్తున్నాడు. ఎందుకు వెలగటంలేదో చూద్దామని చిన్న సుత్తితో నేనూ గాజుబుడ్డిమీద కొట్టి చూశాను.

అది [illegible]గలకుండానే "ఒసేవ్!" అంటూ నాన్న ఒక్క ఉరుము ఉరిమి "పో! అమ్మదగ్గిరకి పో ఇక్కడ ఉండకు"-అంటూ కేకలేశాడు. "ఏమిటి పిల్ల దాన్ని అల్లా అడలగొట్టారు" అంటూ అమ్మ కేకవేసింది. ఆ సుత్తీమేకూ తీసుకొని' అమ్మహార్మోనియం బాగుచేద్దామని, వెళ్ళి కూర్చున్నాను. ఇంతలోకే అమ్మ అక్కడకు వచ్చింది. ఆవిడ మొహం చూస్తేనే, వెఱ్ఱి ఎత్తుతోందని తెలిసింది.

"పోనీలే" అనుకొంటూ మళ్ళీ ముందుగదిలోకి వచ్చాను.

నాన్న రేడియో ఇంకా బాగు చేస్తూనే ఉన్నాడు. అటు చూస్తే, రేడియో స్విచ్ నొక్కకుండానే, రేడియోపాడలేదని దాన్ని పాడు చేస్తున్నాడు నాన్న. నాన్నకు చెప్పినా కొన్ని తెలియవు. అందుకని నేనే ఆ స్విచ్ నొక్కాను.

రేడియోదగ్గరనుండి ఒక్క ఎగురెగిరి "ఓసి పాడుముండా" అంటూ నాన్న ఇవతలకు ఎగిరాడు. నేనూ ఆ ఎగరటం బాగుందని, "ఓసి పాడుముండా!" అంటూ ఒక్క ఎగురు ఎగిరాను—

నాన్న నన్ను పట్టుకొని అదే పనిగా బాదటం మొదలుపెట్టాడు. అమ్మకూడా వచ్చి తిట్టింది. నాన్న ఎందుకు కొట్టాడో, అమ్మ ఎందుకు తిట్టిందో ఇప్పటికీ నాకు తెలియదు. మళ్ళీ ఆపిచ్చే ఎత్తిందేమో అనుకొంటాను. నాన్నకూ అమ్మకూ పిల్లలను కొట్టకూడదనే నమ్మకం ఉంది. పిల్లలను కొట్టవచ్చు అనే నమ్మకం ఉంటే ఇంకెల్లా ఉండేదో!

———



అమెరికన్ కాంగ్రెస్ తాలూకు గ్రంథాలయం. గ్రంథాలయంలో ప్రదర్శించబడివున్న అమెరికా స్వాతంత్ర్య ప్రకటనను బాలబాలికలు చదువుతున్నారు.

బాలానందం :

# చక్రవాకం

శ్రీమతి నందివాడ పుతలీ

దేవలోకంలో ఇంద్రుడు పుట్టిన నాడు గొప్పసభ జరిగింది. దానికి విష్ణుమూర్తి అధ్యక్షత వహించాడు. సభ దేవతలతోను, గంధర్వ కిన్నెరకింపురుషులతోను నిండి కోలాహాలంగా ఉంది.

వశిష్ఠుడు, భరద్వాజుడు, అగస్త్యుడు, విశ్వామిత్రుడు మొదలైన మునులంతా ఇంద్రుణ్ణి ఆశీర్వదించారు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఇంద్రుణ్ణి వేనోళ్ళ పొగిడారు. నారదుడు, తుంబురుడు ఇంద్రుడి కీర్తిని పలువిధాల కీర్తించారు. తర్వాత రంభాదులు వచ్చి నాట్య మాడారు. అందరికన్నా బాగా రంభ నాట్యం చేసింది. సభ అంతా రంభ నృత్యాన్ని మెచ్చుకుంది. విష్ణుమూర్తి రంభని పొగిడాడు.

'ఇంత గొప్ప నాట్యకత్తెను మనం పొందగలిగినందు కెంతో సంతోషంగా ఉంది, ఇంత మంచి నృత్యం నేర్పినందుకు భరతమునికి నా అభివందనములు. రంభ నాట్యంలో చాలా నైపుణ్యం సంపాదించింది. ఆమెకు సాటి ఎవరూ లేరని నిస్సందేహంగా చెప్పచ్చు. ఈమె బ్రహ్మప్రత్యేకసృష్టి ఐఉంటుం దని శ్లాఘించి తన మెడలో ఉన్న ముత్యాలసరం తీసి యిచ్చాడు.

తన భర్త రంభ నంతగా పొగిడి నందుకు లక్ష్మీదేవి కెంతో కోపం వచ్చింది. నాట్యకత్తె నంతగా పొగిడి నందుకు లక్ష్మి ఎంతో చిన్నబుచ్చుకుంది.

"ఛీ సిగ్గేనా లేదూ నాట్యకత్తె నంతగా పొగడడానికి! ఇంతటి దెక్కడా లేదుట ! బ్రహ్మదేవుడి ప్రత్యేకసృష్టిట! ప్రక్కన నే నున్నా ననేనా స్పృహ లేదు గాబోలు! పైగా నేను ఎంతో ప్రేమతో యిచ్చిన ముత్యాల పేరు దానికిస్తారా! ఇలాటిమనిషి పక్కన కూర్చోడంకూడా సిగ్గుచేటు!' అని కొద్దిదూరంగా జరిగి మూతి ముడుచుకుని కూర్చుంది. విష్ణుమూర్తి ఇదంతా గమనించాడు.

"నాట్యం బాగా చేసిందని పొగిడా నంతేకాని నాకు వేరే దురుద్దేశం ఏమీ లేదు. అదీకాక అందరూ అలా పొగిడేస్తోంటే అధ్యక్షుణ్ణి, బెల్లంకొట్టిన రాయిలాగా కూర్చుంటే బాగుంటుందా! మర్చిపోయి నువ్విచ్చిన ముత్యాలపే రిచ్చేశా. యిప్పుడెంతో యిదవుతున్నా. కాని గతించిన దానికి విచారించి ఏం ప్రయోజనం! ముందర జ్ఞాపకం ఉంటే యిచ్చేవాణ్ణి కాదు. ఈ పూలమాల యిచ్చి ఊరుకునేవాడిని. ఇంత చిన్నవిషయానికే అలుగుతే ఎలాగ? అందరూ 'ఈవిడకి కోపం వచ్చిందా ఏమిటి అలాగ కూర్చుందని మన వైపే చూస్తున్నారు. సరిగా జరిగి కూర్చో. ఇంటి కెళ్ళాక మాట్లాడుదాం'

అని నిమ్మళంగా చెప్పాడు. లక్ష్మీదేవి యథాస్థానంలోకి వచ్చి కూర్చుంది.

ఇదంతా వేదికకి దగ్గరగా కూర్చున్న గంధర్వదంపతులు విన్నారు. గంధర్వకాంత భర్తతో "ఇప్పుడేనాబ ప్పకుంటారా పార్వతీ దేవే గొప్పదని. ఆమె ఇలాగ మూతి ముడుచుకుని ఎన్నటికీ చేసేది కాదు. ఇంతమంది మొగాళ్ళలో ఇట్టే కినిసి దూరంగా కూర్చుందంటే ఆమె నేమనాలి!" అంది.

గంధర్వుడు! మీ ఆడవాళ్ళకి ఉన్నదే అది. చీటికీమాటికీ చిర్రుమంటారు. మళ్ళీ వచ్చేసింది చూడు పాపం మెడబాటు సహించలేక పోయింది కాబోలు! అన్నాడు.

"మొగాళ్ళిలాగే మొండిగా వాదిస్తారు. పార్వతీదేవి కెంత సహనం! చిన్నతనంలో ఎత ఘోర తపస్సు చేసింది! ఆగర్భశ్రీమంతుల యింట్లో పుట్టి పెరిగినా, గర్భదరిద్రుడితో కిమ్మనకుండా గుట్టుగా కాపరం చేస్తోంది. ఆమె ఈవిడలాటిదైతే శివుడి కాపరం ఏధిలో ఉండేదే! మెడబాటు సహించలేక మళ్ళీ జరిగిందా" అని గంధర్వకాంత నవ్వింది.

లక్ష్మీదేవి గంధర్వకాంత చివర మాటలు రెండూ వింది. ఆ నవ్వు చూసి లక్ష్మీదేవి కోపంతో మండి పోయింది. ఏమిటి మీరు మాట్లాడుతున్నారని నిండుసభలో విలవ

దీసింది! పాపం వాళ్ళు నిలువునా నీరైపోయారు. చెప్తే ఏం ముప్పో. చెప్పకపోతే ఏం తప్పో! ఆలస్యం చేస్తే యింకా కోపం మునుగుతుందని గంధర్వుడు వణికిపోతూ చెప్పాడు. సభకి రాక పూర్వం పార్వతీదేవి గొప్పదా లక్ష్మీదేవి గొప్పదా అని వాదించుకున్నారని, తర్వాత జరిగిన వాదన—అంతా చెప్పాడు. లక్ష్మీదేవి కోపం పట్టలేకపోయింది.

'ఛీ స్వామిద్రోహుల్లారా! నాకే పంగనామాలు పెట్టున్నారా! ఎడబా టెరగరూ! దానికేం లే అనుభవిద్దురు గాని. మీ రింక గంధర్వలోకంలో తగరు. పక్షులై వియోగం అనుభవించండి' అని శపించింది. లక్ష్మీదేవిశాపానికి వాళ్ళు హడిలిపోయారు.

గంధర్వుడు "ఏదో తెలివితక్కువతనం చేత అది అలా వాదించింది కాని తల్లీ నేనెల్లప్పుడూ నీ దాసుడనే కదా! అంత ఆగ్రహమైతే ఎలాగ! కనికరించమని పరిపరివిధాల వేడాడు. గంధర్వకాంత క్షమించమని లక్ష్మీదేవిని ప్రార్థించింది. లక్ష్మీదేవి మెత్తబడింది. తొందరపడి అంత శాపమిచ్చినందుకు విచారించింది.

"నా శాపానికి తిరుగు లేదు. పక్షులైనా మీరు పగలంతా సుఖంగానే ఉంటారు. సాయంత్రం అయేటప్పటికి ఒకరి నొకరు కానక వియోగదుఃఖ మనుభవిస్తారు. ఒక జన్మ అనుభవించాక తిరిగి గంధర్వలోకప్రాప్తి అవుతుం దని చెప్పింది.

గంధర్వదంపతులు లక్ష్మీదేవి శాపం ప్రకారం ఒక జన్మ వియోగ దుఃఖం అనుభవించి తర్వాత తమలోకానికి వెళ్ళిపోయారు. కాని వారిసంతానం మాత్రం మానవ లోకంలోనే ఉండిపోయాయి. అవే చక్రవాకం పక్షులు.

---

బాలానందం:

# చందమామలోకి ప్రయాణం

శ్రీ ప్రసాద శర్మ

ఆనాడు పౌర్ణమి. సాయంకాలం పూట మా అమ్మ మాకు పెంద రాడే భోజనం పెట్టింది. అన్నంతిన్న తర్వాత ఆరుబయట ఆడుకోటానికి పిల్లల మంతా వచ్చాం. నేను మంచంమీద పడుకుని గుండ్రటి చంద్రుణ్ణి చూస్తున్నాను. మా చెల్లి తమ్ముణ్ణి ఎత్తుకుని "చందమామ రావె, జాబిల్లి రావె" అని చందమామను చూపెడుతూ ఆడిస్తూంది. ఆపాట వింటూ అలాగే చందమామ కేసి చూస్తున్నాను. వెన్నెట్లో ఎంత హాయిగా వుంది! ఇంత తెల్లటి చంద్రుడికి ఈ మచ్చ లెందుకా అనుకున్నాను. మా అవ్వ చెప్పిన మాటలు జ్ఞాపకానికి వచ్చాయి. చంద్రుడిలో పెద్దకుందేలు వుంటుం దట; అది మన కలా కనిపిస్తుందట. నిజమే కాబోలు అనుకుని ఆ మచ్చల్ని చూస్తూ వుండిపోయాను.

ఇంతలో చందమామ నాకేసి చూచి నవ్వి, నన్ను రమ్మని పిలి చాడు. అబ్బ! చందమామలోకి పోతే ఎంత హాయిగా వుంటుంది. అయితే ఎలా పోగలను? నాకేమీ రెక్కలు లేవుగా. చందమామ నా అవస్థ అర్థం చేసుకున్నాడు కాబోలు, "మరేం ఫరవాలేదు", అన్నట్టుగా చిరునవ్వు నవ్వి, తన ప్రక్కన వున్న నక్షత్రానికి ఏదో సంజ్ఞ చేశాడు. అప్పు డేమయిందో తెలుసా! ఆ నక్షత్రం మెల్లమెల్లగా నావైపు రావటం మొదలెట్టింది. దూరానికి ఎంతో చిన్నదిగా కన పడినా, దగ్గరకు రాను రాను ఎంత పెద్ద దవుతోం దనుకున్నారు! కొంత సేపటికి ఓ పెద్దగోళమై ధగధగ మెరసిపోతూ నాదగ్గర కొచ్చింది. ఆ నక్షత్రం. దానిమీద నేను ఎక్కి-ఎక్కడం తోటే, రుయ్ మని ఆకా శంలోకి నన్ను మోసుకపోయింది. దగ్గరకు పోయేకొద్దీ చందమామ పెరిగిపోతున్నాడు. మొదట వెండి కంచ అంత, తర్వాత పెద్ద బండి చక్రం అంత—అలా పోను పోను పెద్దవాడై పోతున్నా డంటే నమ్మండి. ఆయనతోబాటు, ఆయన లోని మచ్చ కూడ పెరిగిపోతూంది బాబోయి! ఇంత పెద్ద కుందేలే! అలా విస్తుపోయి చూస్తూ వుండి పోయాను. ఇంకేముందీ చందమామ దగ్గరకు వచ్చేశాను. ఇంకెంతో దూరం లేదు. ఇదేమిటీ, కుందేలూ లేదు, గిందేలూ లేదు. ఆ మచ్చ లన్నీ చిన్నచిన్న కొండలుగా మారిపోతున్నాయి. ఇప్పుడు బాగా



అమెరికాలో చెవిటివిద్యార్థులకు విద్యాబోధనచెయ్యటానికి మార్గాలు అన్వేషించుతున్న ఉపాధ్యాయ బృందం.

కనిపిస్తున్నాయి. అబ్బో! కొండలు చాల పెద్దవే. అమ్మయ్య! నన్నొక ఎత్తయిన పర్వత శిఖరం మీద దింపేసి, ఆ నక్షత్రం ఆకాశంలోకి పారిపోయింది. ఎటు చూచినా కొండలూ, లోయలూను. మరేం కనబట్టం లేదు. తల పైకెత్తి చూస్తే నల్లటి ఆకాశం, సూర్యుడు! ఇదేమిటి భూమిమీద రాత్రి, చందమామమీద పగలా! గాలి అసలే ఆడటం లేదు. ముక్కులు బిగుసుకపోయాయి. ఇదేమిటిరా బాబూ ఇలాంటి చోటికి వచ్చాను అని భయపడ్డాను.

ఇంతలో 'తమ్ముడు , వచ్చావా', అని ఎక్కడినుంచో కేక వినబడింది. భయం వేసింది. కొంతసేపటికి ఎవరో తెల్లటాయన వచ్చి, నవ్వుతూ, "భయపడకు తమ్ముడూ, నేనే చందమామను," అని బుజ్జగించాడు. నాకు కొంచం భయం తగ్గింది. ఇద్దరం కూర్చున్నాం. కొంచం ధైర్యం తెచ్చుకుని, "మీరు మాకు మామయ్యకదా, నన్ను తమ్ముడూ అని పిలుస్తారేం", అని అడిగాను.

దానికి ఇలా సమాధానం చెప్పాడు, "అవును తమ్ముడూ, మీరంతా నన్ను చందమామ అని పిలుస్తారు. కాని నిజానికి నేను మీ అందరికీ పెద్దన్నయ్య నవుతాను. ఎలాగో చెప్తాను విను, భూమిని మీరు తల్లిగా భావిస్తారు. మీరంతా భూమాత బిడ్డలేగా. నేనూ భూమికి పుట్టినవాణ్ణే. మొట్టమొదట దేవుడు భూమిని సృష్టించినపుడు, భూమి ఆనందం పట్టలేక గిరగిరా తన చుట్టూ తాను తిరిగిపోయింది. అప్పుడు నేనూ మా అమ్మలో మీలాగే ఒక భాగంగా వుండేవాణ్ణి. ఆ విసురుడు ఆపుకోలేక మా అమ్మలోంచి విడిపోయి దూరంగా పడిపోయాను. భూమిలో పెద్ద గొయ్యి ఏర్పడింది. నేను తన నుంచి విడిపోవటం భరించలేక, మా అమ్మ ఎన్నో ఏళ్ళు వెక్కి వెక్కి ఏడ్చింది. ఆ కన్నీళ్ళే ఆ గొయ్యిని నింపేశాయి. పెద్దసముద్రం తయారయింది. దాన్నే మీ రిప్పుడు పసిఫిక్ మహాసముద్రం అంటారు; మా అమ్మబాధ చూడలేక దేవుడు ప్రత్యక్షమై ఇచ్చిన వరంప్రకారం. నే నెప్పుడూ నా ముఖాన్నే భూమివైపు చూపుతూ, భూమి చుట్టూ తిరుగుతూంటాను. సూర్యుడు తన వెలుగును నామీదికి పంపి నన్ను మెరిసేలా చేస్తాడు. ఇప్పుడు తెలిసిందా నా కథ, అని చంద్రుడు నాకేసి చూశాడు. అంతా బాగానే వుంది. కానీ నువ్వు ఒంటరిగా వున్నావు. మనుష్యులుగాని జంతువులుగాని నీకు తోడు లేనా "అని అన్నయ్యను ప్రశ్నించగా, ఆయన ఇలా సమాధానం చెప్పాడు, అదే భూమికీ నాకూ తేడా. ఇక్కడ గాలీ, నీరూ వుండవు. ఇలాటప్పుడు ప్రాణి ఎలా జీవించగలదు? ఈ మాటలు వింటూనే నేను శాస్త్రా ఇక్కడే చనిపోతా నేమో నని భయం వేసింది. పైగా అక్కడ కొండలు కొన్ని హిమాలయపర్వతాలంత ఎత్తుంటాయనీ, వాటిలో చాల అగ్నిపర్వతా లున్నాయనీ చంద్రుడు చెప్పగానే నాలో ఎక్కడలేని భయం పుట్టుకొచ్చింది. గాలి లేదు, నీరు లేదు. జనం లేరు, వున్నవల్లా అగ్నిపర్వతాలా! ఇక్కడ వుంటమే! తక్షణం ఇంటికి వెళ్ళాలను. అన్నయ్యతో చెప్పాను. సరే నని నన్ను తనచేత్తో తాకాడు. మరుక్షణంలో మా దొడ్లో మంచంమీద వున్నాను. ఎండ నామీద పడుతూంది. మా అమ్మ వీపు తట్టి లేపింది. కళ్ళు నులుపుకుంటూ లేచి మా అమ్మచెయ్యి పట్టుకుని, "అన్నయ్యా, నువ్వూ రావూ," అంటున్నాను కాబోలు, "ఛీ, కలవరించకురా" అని లేపింది మాఅమ్మ.

---

# మట్లవారిమీది చాటువులు

(ముందు సంచిక తరువాయి)

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

## మట్ల వెంకటరామరాజు

ఇతడు నడిమింటి వెంకటపతి యను కవీశ్వరుడు రచించిన * యభిషిక్తరాఘవమను పద్యప్రబంధమునకు కృతిపతి. ఇతని యన్నకుమారుడు తిరువెంగళనాథరాజు. అతనికే యప్పయరాజనియు మతియొక పేరు కలదు. వెంకటరామరాజుగారు తాము సజీవులై యుండి, తమ కుమారులగు రెండవ కుమార అనంతరాజును తప్పించి తమ యన్నకుమారు లైన తిరువెంగళనాథరాజుగారికి నిజఖడ్గమూల మయిన ప్రతాపమువలన సంప్రాప్త మయిన మహారాజ్యపదవిని దయచేసి పట్టము గట్టిరి. శాలివాహనశక వర్షములు౧౬౨౭అగు నేటి వ్యయసంవత్సరము మొదలుకొని తిరువెంగళనాథరాజుగారు స్వతంత్రులై రాజ్యము చేయుచుండి తమ పినతండ్రిగా రగు వెంకటరామరాజుగారి పేర కృతిగా ఆర్వేలవారు నడిమింట వెంకటపతి యను కవీశ్వరునిచేత అభిషిక్తరాఘవము అను గ్రంథము పద్యకావ్యము చెప్పించిరి. ఆ యీ విషయము అభిషిక్తరాఘవములో నిట్లున్నది.

హంసవంశంబుల నవఘళించె
హితకోటిరక్షాభిరతు దయ్యు నని మహా
హితకోటి నసిధార నే పడంచె
బరభీరువులకు బల్ ప్రాపయ్యు దను గోరు
పరభీరువులకాంతు దొరగ జేసె
నీతివర్తన కళాన్వితు డయ్యు వరదాన
నీతివర్తనకళానిరతి గాంచె
ననుచు బుధు లెన్న వెలయు లోకైకవిశ్రు
తోప్తదిగ్రాజకులహృద్భయంకరారి
దళవిభాళాదిబిరుదాంకితప్రభాస
నాధు డగు మట్ల తిర్వెంగళాధినేత!.
ప్రతిలేని పసిడి కీల్ ప్రతిమ లందము నొందు
మానినీమణులు చామరలు నైన
హంసవంశోత్తంస మయ్యు సత్కీర్తిచే
దెస వెల్గు మన్నీల పసమించు సరిదొరల్
కొలువంది యిరుగెలంకుల వసింప
సకలశాస్త్రములు రస్సరరాజమూర్తులై
ఘనకోవిదులు ప్రసంగములు సేయ
హరిదంతరాగతోద్యన్మహీపాలకా
మాత్యవర్గంబు లేమరక కొల్వ
హితపురోహితబాంధవాశ్రితజనంబు
లెనసి చెంత బ్రకాశింప నింపు సొంపు
సంపద ఘటింప సాక్షా న్నిలింపవిభుని
యొజ బేరోలగంబుగా నుండు నపుడు.
నవరసగుంభితసత్కృతి
కవితామృతరసము లింపు ఘటియింపగ గా
రవమున నను గనుగొని మన
మివురింప సుధామయోక్తి నిట్లని పలికెన్
"సరసాగ్రేసరు లెల్ల మెచ్చుకొనగా
జాతుర్యసంపత్తి ని
ర్జిరభాషాకృతు లాంధ్రకావ్యములుగా
జాలూర జేయంగ నే
ర్పరివిన్ సాధుసుధామయోక్తివి తలం
పన్ నీకు జోడెవ్వ రీ
ధరలోనన్ నడిమింటి వెంకటపతీం
ద్రా! సాంద్రమేధానిధీ!
తండ్రిసైదోడు నిజఖడ్గదళితవైరి
వీరసంప్రాప్తసామ్రాజ్యవిభవభోగ
భాగ్యసంపద దయచేసి బహువిధముల
నన్ను బ్రోచిన పెన్నిధానంబు సుమ్మ
కావున—
ఆ రాజాగ్రణికై నీ
వారాజార్కముగ జేయు మగణితముగ నీ
యారాజ్యావికృతిన్
స్వారాజ్యామాత్య, సదృశసభ్యులు దలపన్ బ

ఈ ప్రకారము కవీశ్వరుని బ్రార్థించి తమ పినతండ్రిగారగు వెంకటరామరాజుగారికి కృతిగా 'అభిషిక్తరాఘవము' అను ప్రబంధమును జెప్పించిరి.

అభిషిక్తరాఘవములో కృత్యాదిపద్యము లివి—

శ్రీ వక్షోరుహకుంకుమాంక మెద రా
జిల్లన్ విలోకించు భూ
దేవిం గ్రుచ్చి కవుంగిటం బొదివి త
త్ప్రేమానుబంధంబులన్
దా నైచిత్రి మడుంగు సేయుచు బొదల్
తద్దేవతామాళి స
ద్భావున్ వెంకటరామభూవిభు జగ
త్ప్రఖ్యాతుగా బ్రోవుతన్
పటుబుద్ధిన్ నిజభామభాక్తరుణి తా
బ్రాంచ ద్వివాసాద్రి నో
క్కటు నీడల్ గని గౌరి! చూచితివె చో
క్కాటంపు నీదౌ కవుం
గిట నేనున్న తెఱంగటంచు నరుదుల్
గ్రీలొల్కు ల్పు నవ్వేల్పు వెం
కటరామాధిపు మట్లవంశజు గటా
క్షశ్రీల రక్షించుతన్
కమనీయాంతతహేమగర్భతకు యిు
క్తం బౌ నటంచున్ సువ
ర్ణమయాకారవధూటిపొందు గని త
ద్రామాకుచాద్రిప్రభా
వము శాస్త్రంబులుగా బఠింపు నజు డో
ప్పన్ బ్రోవుతన్ మట్లవం
శమణిన్ వెంకటరామ రాజవరు న
శ్రాంతంబు రంజిల్లగన్
శ్రీ నెంతే సమకూర్చు గాత పటురా
జీవప్రభారామమై
నానామ్నాయ మహీరుహాగ్రదళమై
నవ్యాంతరాయాద్రి సం
తానదోర్యధిప వజ్రమై సకల దీ
నత్రాతవాస్తవ్యసం
తానం బైన గజాననాంఘ్రియుగ ము
ద్యత్ప్రేమ మా కెప్పుడున్.
ఉపనిషదర్థవీధి గము
లొన్నతపీఠ విపంచి మీటు మన్
గృప దనముద్దురాచిలుక
కంపెసలార సమస్తవిద్యలున్
విపులతరప్రభావమున
నేర్పెడు భారతి యిచ్చు గాత మా
కపరిమితప్రబంధరచ
నైకధురీణవరప్రసాదముల్

* ఈ గ్రంథము మదరాసుప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున గలదు.

* మట్లరాజుల యౌదార్యమును దెలుపు నొక చిన్న కథ యిది మట్లవారిసీమలో జనులు చెప్పుకొందురు

మట్లరాజులలో నొకరు వేటకు బోయి యాటవికవేషముతో నొంటరిగ గనుచీకటి పడువేళ నొక యగ్రహారమునకు వచ్చెనట! ఒక బ్రాహ్మణగృహస్థుని యింట నా రాత్రి తలదాచుకొందమనుకొని లోనికేగి విచారింపగా నాడు గృహపతి గ్రామాంతరము పోయి యుండినట్లు తెలిసినది ఇక మఱొక యింటికి బోదము గాక యని యతడనుకొనుచుండగా నా బ్రాహ్మణి యతడు రాజని గుఱుతించి లోనికి దీసికొనిపోయి యతిథి సత్కారము గావించి యఱువది నాలుగువిధములుగా కూరలు, పచ్చడులు, భక్ష్యములు లోనగువానిని సిద్ధపఱిచి ప్రసన్నోపేతముగా మృష్టాన్నభోజనము నిడెనట ఆమె సత్కారమునకు సంతుష్టుడై యా రాజు అఱువదినాలుగు కుంటలభూమి నామెకు దానము చేసి యా రాత్రి యందుండి మఱునాడు రాజధానికి దరలిపోయెనట. ఈ కథ యెందనుక విశ్వాస్యమో మనకు దెలియదు కాని యా భూమి పచ్చడుల మాన్యమను పేర నేటివఱకు బిలువబడుచుట్ట యున్నది మట్లరాజుల యౌదార్యమనేది

సారంగపాణిపదములలో మట్లవారి సీమ పేర్కొనబడినది మట్లవారి సీమ యా కాలమున చీరలకు మిక్కిలి ప్రసిద్ధి గాంచి యున్నటుల దాని బట్టి తెలియుచున్నది మట్లవారిసీమకు లోకువ యయిన పుల్లంపేట శ్రేష్ఠమయిన చీరలకేతకు నేటి ని ప్రసిద్ధి వహించియున్నది పుల్లంపేట చీరలని ప్రజల వ్యవహారము-చూడుడు-

పున్నాగవరాళి రాగము-ఆదితాళము

పల్లవి

మట్లవారిసీమచీర నిను పది
మాట్లడిగిన లే దంటివి బంగరు

అనుపల్లవి

గట్లు దాని కిచ్చితి విక నీవి
కిగ్గట్లు దక్క వేణుగోపాల

చరణములు

కట్లసంచి పొరలో దాచిన
కట్లదంతకూడా పణతిచే
కట్ల కిచ్చినది నే తెలవార
కట్ల వింటి జాడా యిట్లా
పట్లదే యోగశాలిరా విసే
పట్ల యెంచి చూడా మేల్
కట్లయిండ్లు విడిది చేసితివి తా
కట్లమారి సుడికాడా॥1

రాళ్లమర్చిన పతకము పావు
రాళ్లపలుకుకేనా పె
మూళ్లపచ్చ దారబోసినది పేరు
మూళ్ల ప్రీతిగానా చె
క్కిళ్ల సొగసు మెచ్చి యిచ్చినది యొక
కళ్లముంచమేనా నీ
వేళ్లవుంగరా లేవిరా వట్టి
వేళ్ల చప్పరము లోనా॥2

కేళి కూడితేనే గెలితో రతి
కేళి సల్పనగునా వింతి
యాళి సింగము కేతె రాతిరా గ
య్యాళి కియ్య దగునా
తాళిమితో నను కూడి యింత యెగ
తాళి సేయ నగునా అ
చ్ఛాళిగా సుదతి చేతనే పద
చాళి చిత్తగించి వీ వగనా॥3

పండితసత్కవిప్రవర
పౌరజనాళి యలంకరింపగా
నిండుసభం దెలంగి యవ
నీధవు లంతల నంత నిల్వగా
దండిగ గావ్యచర్చ చేసి
దాల్చిన మట్లధరాధినాయకుల్
చండభుజప్రతాపు లను
జన్మలు నీకు దెలుంగునోదరా!

* ఈ కథ శ్రీ జనమంచి శేషాద్రిశర్మ గారి కడపమండలచరిత్రమున గలదు



ముఖ్యమంత్రి శ్రీ పి. యస్. కుమారస్వామిరాజా, ఏప్రిల్ 6 న తిరువూరులో ఆంధ్రమహిళా బేసిక్ ట్రైనింగ్ స్కూలుకు శంకుస్థాపన చేసిరి.

# రుద్రమదేవి

(10-వ పేజీతరువాయి)

ర్ధము కొన్ని నావ లుండును. అందొకదానిని చక్కగా అలంకరించి స్వయంభూదేవుని యుత్సవసమయములలో ఉత్సవవిగ్రహముల నుంచి సరోవరవిహారము చేయించు నాచారమును గలదు. ఆ సరోవరమున గల క్రీడానౌకలను నేడు యుద్ధనావల ననుకరించునట్లలంకరించిరి. అంతట మోటుపల్లిలో జరిగిన సముద్రయుద్ధమును నేలపై యుద్ధమును కూడిన జనసమూహముసమక్షమున అద్భుతముగా ప్రదర్శింపబడెను.

ఆ చెరువు దక్షిణపుచివరను తీరము నాని చాలనావలు నిద్దురపోవుచున్నట్లే నిలిచియున్నవి. వాని కెట్టి యలంకారములును లేవు. అందలి నావికులును భటులును అశ్రద్ధగా నృత్యములతో గానవినోదములతో క్రీడలతో లోకాభిరామాయణములతో ప్రొద్దుపుచ్చుచుండిరి.

ఇక నీవలియొడ్డున, స్వయంభూదేవాలయదక్షిణద్వార సమీపమునుండి అల్పసంఖ్యాకము లగు నావలు బయలుదేరినవి. ఇవి సర్వాలంకృతములై ధనుర్ధరు లగు భటులతో నిండియుండి వీరోల్లాసముతో కలకలలాడుచున్నవి. ధ్వజములు గాలి కల్లాడుచుండగా ఇవి బయలుదేరుటలోనే ఒక ఉత్సాహము ద్యోతమయ్యెను.

ఈ స్వయంభూదేవుల నావలు సమీపించువరకు నావలి యొడ్డున గల నావలన్నియు కదలక మెదల కున్నవి. కాని యివి చున్నంతనే ఆవలి నావలలో కలవరము ప్రారంభించినది. సంభ్రమముతో నవి యుద్ధమున కాయితము కాజొచ్చినవి. కాని ఒకదానికి చుక్కాని లేదు; మరియొకదానికి చాపకట్టుకంబము లేదు; కొన్నిటికి తెడ్లు లేవు; కొన్నిటికి తెడ్లుమార్చు మేకులు లేవు; మరి కొన్నిటికి తెరచాపలే కనబడవు. నావికులు కొన్నిటి తెరచాపలు పరచుకొని వానిపై నిదురించుచుండిరి. వారు నిద్రలోనుండి తత్తరముతో లేచి చాపలు కొడికి తగిలింపబోవుచుండ నవి జారి నీటిలోబడి తడిసిపోవుచున్నవి. భటులవద్ద విలున్న నంబు లుండవు; అంబులున్న విం డ్లుండవు. ఇట్టి గందరగోళములో నున్న యా శత్రునావలను స్వయంభూనౌకలు చుట్టుముట్టెను.

ఆ సమయముననే త్రిపురాంతకుని పటమున్న భద్రగజముపై నంబదేవు డుండి సేనతో నావలి యొడ్డున గల పటకుటీరములపై బడెను. వానినెల్ల నాతడు శీఘ్రముగ చుట్టుముట్టి స్వాధీనమొనర్చుకొని యందున్న సిద్ధయదేవుని బంధించెను.

ఆ సిద్ధయదేవుని ప్రదర్శించుటకు, అతని యాకారము ఎరిగినవారు నిజముగా నాతడే ప్రత్యక్షముగా కనబడుచున్నాడని భ్రాంతిపడినంత చక్కగా, నాతని బొమ్మ యొకటి చేయబడెను. ఆ క్రిందటిరాత్రి యంతయు మేలుకొనియుండి ఓరుగంటి మోహరివాడలోని కుట్రపుపనివారు పలువురు కలసి గడ్డితో నా బొమ్మ చేసి దానిపై మట్టి పూసి రంగులు చిత్రించిరి.

అట్లు చేయబడిన సిద్ధయదేవుని, ప్రతికృతిని అంబదేవుడు శిరశ్ఛేదము చేయించి దాని మొండెమును తలయు చెరియొకప్రక్కను ఆవలి రేవుమొగను ఎత్తుగా నిలుపునట్లు చేసెను.

అంతట స్వయంభూనౌకలు ఆవలి యొడ్డున గల శత్రునౌకలనెల్ల సమీపించుస్వాధీన మొనర్చుకొని యందలి నావికులను భటులను బంధించెను.

మోటుపల్లి విజయయుద్ధనాటక మీ విధముగా ప్రదర్శింపబడుచుండ దానిని విలోకించుటకై శ్రీరుద్రదేవమహారాజు ఆ సరోవరము నానియున్న ఏకశిలాక్రీడానగరమున పేరోలగము తీరియుండెను. ఆమెప్రక్కనే మహాధ్వజస్తంభమువలె నంగరక్షకుడగు పర్వతనాయకుడు సర్వాయుధోపేతుడై నిశ్చలముగా నిలిచియుండెను. ప్రక్కనే బాలప్రతాపరుద్రదేవు లధివసించి యుండిరి. శ్రీమత్ గోవిందనాయకుడు, బయ్యనాయకుడు, తిక్కచమూపతి, జాయప, బద్దెన, మహాదేవరాజు, స్థలసుంకాధికారి యగు గోనగన్నారెడ్డి, ఆయసగాంగ్ల యధికారి యగు నాగదేవుడు, రేచర్ల కామయ, సామయ, మల్లయ, గణపిరెడ్డి, మర్రెడ్డి, కోటకేతరాజును మరియును పెక్కు రున్నతాధికారులు నందు యథోచితస్థానము లలంకరించి యుత్సవము తిలకించుచుండిరి. నాగరకు లగు జను లందరు నా సరోవరపశ్చిమతీరమున గుంపులుగుంపులుగా కూడి యా వినోదము నుత్సాహముతో తిలకించుచుండిరి.

మోటుపల్లి సలజలదుర్గములను పట్టుకొనుట ప్రదర్శించిన పిమ్మట అంబదేవుడు ఏనుగుపైనుండి దిగివచ్చి, త్రిపురాంతకుని ప్రతికృతిని, అతడు పంపిన జమ్మిరెమ్మను, సిద్ధయదేవనామాంకితపత్రమును, వినీతుడై మహారాజులకు అర్పించెను. ఒక్కసారిగా జయజయనినాదములు క్రీడాపర్వతమున నుప్పతిల్లి సరోవరము నుత్తరతీరమున గల రాజభటసందోహముననను, దక్షిణతీరమున గల నావలయందును అచ్చటి వీకులందును, పశ్చిమమున గల ప్రేక్షకనాగరలోకమునందును ప్రతిధ్వనించెను.

అప్పుడు శ్రీ రుద్రదేవమహారాజు లేచి స్వయముగా త్రిపురాంతకుని పటము శిరస్త్రాణముపై నా జమ్మిరెమ్మయు సిద్ధయదేవనామాంకితపత్రమును అలంకరించెను. మరియు త్రిపురాంతకునికి పూర్వమున్న బిరుదావళికి తోడుగా ఈవాడు, 'సిద్ధయదేవచోడ తలగొండుగండ' అను బిరుదము సభాసమక్షమున మహారాజు ప్రసాదించెను.

మూడవనాటి యుత్సవములు బహుమతులు పంచిపెట్టుటతో ఎక్కువభాగము పరిపోయెను. ఆ రాత్రి వీధినాటకములు బొమ్మలాటలు చత్వరమున కొక్కటిగా ప్రవర్తిల్లుచుండెను.

ఈ మూడునాళ్లును నగరమంతయు మహోల్లాసముతో నుండెను. కాని ప్రతిదినమును అపరరాత్రవేళ సంగీతములో నపశ్రుతి వలె నొక భిక్షుకుని కంఠస్వరము వీథివీధుల వాడవాడల ప్రసరించుచుండెను.

"అల్లో జ్యేష్ఠం శ్రేష్ఠం పరమం పూర్ణం బ్రహ్మణమల్లాః
అల్లో రసూరమహామదరకం వరస్య ల్లో !"

* * * *

"ఇల్లా కబర ఇల్లా కబర ఇల్లల్లేతి
ఇల్లాలాః ఇల్లా ఇల్లల్లా !"

ఈవిధముగా తెగని తీగవలె నా నూతనోపనిషత్తు సాగిపోవుచునేయుండెను.

మరియు నొకవంక విజయోత్సవములు సాగుచునేయున్నవి. భద్రిసరోవరతీరమున గల స్కంధావారమునను పాఖాలసరోవరతీరమున గల స్కంధావారమునను కదలిక యతిశయించెను. కాకతీయవీరభటు లందరకు వారివార స్కంధావారములకు చేరికొని సర్వసన్నద్ధులై యుండ నాజ్ఞ లయ్యెను. పడవవాండ్లు చేయు సన్నాహములు వృద్ధి నొందుచుండెను. ఉత్సవము లయిపోయినమరునాడు ఓరుగల్లువీధు లన్నియు శాంతము లయ్యెను.

ఆనాటి తెల్లవారుఝామున భద్రిసరోవరతీరమున డివిటీలు అసంఖ్యాకముగా కానవయ్యెను. దేవత లప్పుడప్పుడు ఆ సరోవరజలములలోనికి చిత్రవిచిత్రమార్గముల నవతరించుచుందు రను జనప్రథ కలదు. ఈనాడక్కడనుండి యనేకసహస్రసంఖ్య లగు సేనలు కదలెను. అట్లు వారముదినములలో నటనుండి రెండులక్షలసేన కదలెను. దానికి అంబదేవుడు సర్వాధికారి. మరి రెండులక్షలసేన పాఖాలనుండి బయలుదేరెను. దానికి అడిదమ్మ యధికారి.

ఆ సేనలు కదలిపోయిన పిమ్మటఓరుగల్లునగరము నిర్మానుష్యమే ఐనదా యనునట్లుండెను. కోటగోడలు కట్టుట సాగుచునే యుండెను. ఇప్పుడందులో అంబదేవుని స్థానమున గోనగన్నారెడ్డి నియమితుడై యా వ్యవహారములు నిర్వహించుచుండెను.

గండనికి సైన్యములో చేరవలె నను నుత్సాహము కలిగినది. మేచయ యాతని క్షేమ మర్థించి దూర మంపివేయదలంచియుండెను. గండని నూరుమంది యుద్ధవీరుల కధికారిని జేసి తన స్కంధావారరక్షకభటులలో నుండ నియమించి యంబదేవుడు వెంట గొంపోయెను.

---

# ప్రతీకారం

(12-పేజీ తరువాయి)

'నేను ఎవరికొంప కూలద్రోశానో వాళ్ల కోసం!'

'ఎవరు వాళ్లు? మీరేమి చేశారు?'

'ఇదిగో...చూడు...ఈ దేవాలయం... ఇది ఎవరు కట్టించారో...వాళ్లను...ఆ భార్యాభర్తల్ని.. ఆ చిన్నారికొడుకును...ద్రోహబుద్ధితో నాశం చేశానా... అబ్బ నన్ను వదులు. నేను పోవాలి...... వాళ్లు పాపం ఏమి కష్టపడుతున్నారో... వాళ్లను కలుసుకుంటా.'

'శాంతించండి....శాంతించండి...వాళ్లు మీ కెక్కడ కనిపిస్తారేమిటి?'

'అయ్యయ్యో! నా పాపానికి తగిన శిక్ష అనుభవిస్తున్నా నా కొంప కూలింది. నా కుటుంబం నాశనమైంది. ఒక్క మేఘమాలతప్ప అందరినీ కోల్పోయాను....'

'అబ్బబ్బ...నన్ను విడు...ఈ రోజే... ఈ రాత్రే.. వాళ్లను కల్సుకుంటా!'

'ఎప్పుడో చనిపోయినవాళ్లను మీ రెక్కడ కలుసుకుంటారు బాబూ?'

'చనిపోయారా? చనిపోయార...... ఊహుఁ...వాళ్లు చని లే! కాళిమాత నన్ను ప్రేరేపించింది......నే పోతా...ఆ చంటిబాలుణ్ణి వెతుకుతా.. ఆ బాలుని శాపం న న్నీగతికి తెచ్చింది...ఆ శాపవిముక్తికే... నాముద్దుబిడ్డ మేఘమాల బతకడానికే... నేను వెళ్లుతా!'

అర్చకుడు ఒక్క వూపున పట్టు విదిలించుకొని పకుగెత్తాడు.

కాళీప్రసాదు మళ్ళీ వెంబడించాడు.

దేవీప్రసన్నుడు వున్నట్టుండి ఆగాడు.

'ఎవరు నువ్వు' అని ఆరిపోయిన కంఠంతో అడిగాడు.

'నేనే మీరు ఏ బాలునికోసం తహతహలాడుతున్నారో అతణ్ని నేను...మీ అన్వేషణ పూర్తయింది.'

'నీవా! నీవేనా' ఆ వున్మత్తుని కంఠం బొంగురుపోయింది.

'నీవా.. నన్ను నువ్వేనా శపించింది...' అంటూ దేవీప్రసన్నుడు నేలకొరిగాడు.

'అయ్యో...నే నెంతపాపం ఒడిగట్టుకొన్నాను...నాప్రాణం తీసుకోనాయనా, నా కుటుంబానికిమటుకు శాపవిముక్తి చెయ్యి...'

ఇవీ ఆ వృద్ధుని తుదిమాటలు.

దూరంలో మరణావేదన.........మరుక్షణంలో మేఘమాల అంతరించింది.

కాళీప్రసాదుకు పిచ్చిపట్టినట్లయింది.

ఉన్మత్తునిలాగా కేకలు వేస్తూ గర్భగుడిలోకి చుమికాడు.

దేవిచేతిలోని వాడియైన ఖడ్గాన్ని పుచ్చుకొని విగ్రహమును తుత్తునియలు చేశాడు.

'కఠినాత్మురాలా! ఇంతటితో నీ దాహం తీరిపోయిందా?' అని రోషావేశంతో అరిచాడు.

తళతళ మెరిసే ఖడ్గాన్ని గుండెలోకి గుచ్చుకున్నాడు. మరుక్షణం దేవిపాదముల ముందర అతని కళేబరం తటాలున పడిపోయింది.

కాళీప్రసాదుకు కోరినవరం సంప్రాప్తించింది. అయినా అదేమి చోద్యమో వరము కోరిన భక్తుణ్ని ఆ వరం తన పొట్టబెట్టుకుంది

(బెంగాలీకథ ననుసరించి)

---





# మాతృవిజ్ఞానం

(14-వ పేజీ తరువాయి)

అందరు బిడ్డలూ ఇలా భయపడరు. కొందరికి కొత్తవాళ్లని చూడ్డం ఇట్టే అలవాటవుతుంది.

ఎనిమిది పదకొండుమాసాల మధ్యవయసులో బిడ్డలు చాలామంది కొత్తవాళ్లని స్నేహితులుగా చూస్తారు. అప్పుడు మనుషులకంటె వస్తువులపట్ల వాళ్లకి శ్రద్ధ ఎక్కువవుతుంది. కాని మళ్లీ ఏడాదిగడిచే సమయంలో అనుమానం కలుగుతుంది. కొత్తవాళ్లు దగ్గరికి వస్తుంటే కాళ్లమీదలేచి తల్లి ఒడిలోకి పారిపోతాడు. తల్లికంఠంలో ముఖం దాచుకుని బిగ్గరగా ఏడుస్తాడు. ఏడుస్తూ మధ్యమధ్య ఆగి కొత్తవాళ్లు ఉన్నదీ లేనిదీ వెనక్కి తిరిగిచూస్తాడు. అప్పుడు మాపులు వాడిగా ఉంటాయి. కొత్తవాళ్లు వెళ్లిపోయిన వెంటనే ఏడుపు ఆపేస్తాడు. కొందరు కొంత మచ్చికకి లొంగుతారు. ఏడుపు ఆపేసిన తరవాత నిదానించిచూసి, మచ్చికచేసుకునే వారిమీద నమ్మకం కుదిరితే క్రమంగా స్నేహం చేస్తారు కూడా.

ఏడాది దాటినప్పుడు బిడ్డ కొత్తవాళ్లలో కొందరితో స్నేహంగా ఉంటాడు కొందరి దగ్గరికి వెళ్ళడానికి ఏమైనాసరే ఒప్పుకోడు. ముందుగా కొంత దగ్గరికి జరిగి కొత్తవాళ్ల ముఖంలోకి పరీక్షగా చూస్తాడు. చేతులో ఉన్న వస్తువుని కొత్తవాళ్లకిస్తాడు. వెంటనే తిరిగి తీసేసుకుంటాడు. ఇవ్వడంలోనూ తిరిగి లాక్కోడంలోనూ ఏదో పెద్ద పరీక్షచేస్తున్నవాడి మాదిరిగా చూస్తాడు. ఆ వస్తువుని కొత్తవాళ్ళచేతుల్లో ఆట్టే సేపుంచనియ్యడు. నమ్మకం కలిగి స్నేహంచేసిన తరవాతనైతే ఇంట్లో మూలమూల ఉన్న వస్తువులూ తెచ్చి కొత్తవాళ్ల ఒళ్ళో పోగు పోస్తారుకూడా.

ఇల్లా పరీక్షచేసే కాలంలో, వాడిపరీక్ష వాణ్ణి పూర్తిచేసుకోనివ్వాలనే జ్ఞానం చాలా మందికి ఉండదు. ఏగో వాగుతూ గబగబా సమీపిస్తారు. వాడు అంత వేగంగానూ తల్లి దగ్గిరికి పారిపోతాడు. ఆతరవాత స్నేహం చేసుకోవాలంటే చాలా సేపు, చాలారోజులుకూడా పట్టుతుంది. ముందుగా కొత్తవాళ్లు తల్లితో చనువుగా కొంతసేపు మాట్లాడి ఆతరవాత నెమ్మదిగా స్నేహం చేసుకోడం ప్రారంభిస్తే బిడ్డకి చనువు సులువుగా అబ్బుతుంది.

ఏవిషయంలోనైనా సరే ఒక్క విషయాన్ని తల్లిదండ్రులు జ్ఞాపకం ఉంచుకోవడం అవసరం. బిడ్డని గారాబంతో చూసేకంటే, వాడుకూడా ఆలోచనగల ఒక పెద్దమనిషే నన్నట్లుగా వాడితో ప్రవర్తించడం మంచిది. గారాబంలో ఎంత ఆపేక్ష ప్రదర్శించవచ్చునో, ఇందులో కూడా అంత ఆపేక్షా కనపరచవచ్చును. రెండోపక్షం అయితే బిడ్డ పెరుగుదల సక్రమంగా ఉంటుంది. వాడికి ఆత్మబలం, ఆత్మవిశ్వాసం అలవడతాయి. బిడ్డ పెరుగుదల చూసి ఆనందించడమే కాకుండా, అభ్యాసాలు సక్రమమార్గంలో పెట్టినట్లయితే వాడిలో వ్యక్తిత్వం పువ్వులా వికసిస్తుంది. [డా॥ బెంజామిన్ స్పాక్ గ్రంథం ఆధారంగా వ్రాసిన వ్యాసం]

# కులాసాకబుర్లు

(16 వ పేజీ తరువాయి)

వెళ్లారు. కష్టసుఖాలు చెప్పుకున్నారు. లొంగిపోక తప్పదన్నారు. త్వరలో పాత మిస్సెమ్మకు శ్రీముఖం ఇవ్వకపోతే పరిస్థితులు మరీ విషమించి పోగలవని నచ్చచెప్పారు. తిరిగి ఎన్నికలకు నిలపదలచిన వారు అందుకు ఒప్పుకొని తీరాలని హెచ్చరించారు. లేకపోతే పసిపిల్లల కాటకం వచ్చితీరుతుంది అన్నారు.

ఎన్నికలమాట హెచ్చరించేసరికి సంఘం వారికి తేలుకుట్టినట్లయింది. వెంటనే అత్యవసర సమావేశానికి నోటీసులు పంపారు. ఆనాడు సభ్యులందరూ హాజరై పాత మంత్రసానికి మూడు మాసాల జీతం అదనంగా ఇచ్చివదలించుకోటానికితీర్మానం చేశారు. అదే తీర్మానంలో ట్రైనింగుచేసిన నర్సును పిలిపించటానికి ఒప్పుకున్నారు.

ఇప్పుడు కొత్తమిస్సెమ్మే మంత్రసాని. అసలే ఇరుకుగా ఉంటే రెండవమంచం ఎందుకని బయటపడవేశారు. జేములు మంచాలు సమీపానికి చేరుకున్నవి. ఇప్పటి సంభాషణ ఈ విధంగా ఉండవచ్చు.

పడమటిమంచం:- "ఏమండోయ్"

తూర్పుమంచం:- "......" [నిశ్శబ్దం]

ప. మం:-"మిమ్మల్నే నండీ మాట్లాడరేం?"

తూ. మం:- [గురక]

ప. మం:- "ఎందుకీ దొంగనిద్రలు! రహస్యం చెప్పాలండీ"

తూ. మం:- "[పెద్దగురక]"

ప. మం:- నాకు జ్వరం వచ్చినట్లున్నది చూడండీ"

తూ. మం:- అబ్బా మంచినిద్రలో ఉంటే." [నెమ్మదిగా తెర]



రెండవయుద్ధంలో పాల్గొన్న ఈ అమెరికన్ వయోజనులు "జి. ఐ. బిల్." సావకాశంతో క్రొత్తవృత్తులు నేర్చుకుంటున్నారు. ఈ శిక్షణసమయంలో వీరికి అవివాహితులకు 65 డాలర్ల చొప్పున, వివాహితులకు 90 డాలర్ల చొప్పున ఉచితవేతనా లిస్తారు.

# సంగీతము

(17-పేజీ తరువాయి)

రాగాలాపన చేయవలెను. ఇట్లు చేయుటలో ఉచితమగు వర్ణాలంకారముల నుపయోగించి, రాగస్వరూపమును చక్కగా ప్రకాశింపజేయునట్టి స్వరములను ప్రయోగించుచు, బహుత్వ, అల్పత్వనియమానుసారముగ ఆయా రాగలక్షణముల ననుసరించి, వక్రసంచారము లుండుచోట్ల తగునట్లు సంచారమును జేసి, రాగచ్ఛాయలను చెరచునట్టి వివాదిస్వరములను జాగ్రత్తతో త్యజించుచును; లేక లక్షణయుక్తములగు గమకములవల్ల నా వివాది స్వరదోషములను (వంచించి) యధిగమించుచూ అచ్చటచ్చట రాగరంజనము కొఱకు రంజనమును కలిగించెడి "అన్యస్వరము"లను సందర్భోచితముగా ప్రయోగించుచు, క్రమక్రమముగా తారషడ్జము వరకును సంచారమును జేసి యచటనుండి విదారితముగా ననగా చీల్చుకొని క్రమముగా మధ్యస్థాయిషడ్జమునకు వచ్చి, రాగమును ముగించుటను "ప్రథమరాగవర్ధని" యందురు. ఇట్లు చీల్చుకొని దిగివచ్చిన విదారణను "ప్రథమవిదారి" అని అంటారు.

ఆ తరువాత ద్వితీయరాగవర్ధనిని పాడాలి:—ఇదియును ప్రథమరాగవర్ధనివలెనే రాగ సంచారమును జేయుచు విచిత్రకల్పనలతో గమక; వర్ణ; అలంకారములు రంజింపజేసి కల్పనాప్రతిభను వెల్లడిస్తూ, రాగాన్ని ప్రస్తరించాలి. ఇది యెక్కువ మధ్యమకాలముగా పాడాలి. ఒక అపన్యాసంనుంచి రెండో అపన్యాసమునకు దిగేటప్పుడుగాని; ఎక్కువప్పుడుగాని; త్రికాలసంగతుల నుపయోగించాలి. ఇట్లు ముఖ్యంగా మధ్యస్థాయి యందును, అనంతరము తారమధ్యమ, పంచమములవరకుసంచారమొనర్చి, అచ్చటనుంచి రెండవవిదారిచే ద్రుతకాలపు సంగతులతో, రాగవర్ధనిని ముగించి మధ్యషడ్జమునకు తిరిగివచ్చి ముగించుటను "ద్వితీయరాగవర్ధని" అంటారు.

తృతీయరాగవర్ధనియును - ఆ తృతీయ విదారియును:—ముఖ్యముగా దీనిని తారస్థాయిలో సంచారము చేయవలయును. మధ్యమకాలత్రికాలసంగతులతో ప్రస్తరించాలి. అప్పుడప్పుడు ఇతర స్థాయిలకు దిగిరావాలి. రక్తి చెడకూడదు. మొదట మధ్యస్థాయి పంచమమునుండి తారస్థాయి షడ్జమున కేగి, యచటనుండి వరుసగా తారపంచమమువరకును యథోచితముగా సంచరించి మూడవ విదారిచే రాగవర్ధనిని ముగించుకొని మధ్యషడ్జమునకు వచ్చి నిలుపుటను "తృతీయ రాగవర్ధని" యందురు.

ఇకను కడపటిదియగు చతుర్థరాగవర్ధని; దాని విదారియు:—ఈ రాగవర్ధనిని స్వల్పంగాను, విశేషమూర్ఛనాప్రస్తారయుతో పై కాలంలో పాడాలి. రెండవ, మూడవ, రాగవర్ధనులవలెనే సంచారము చేయుచు రాగవర్ధని చేయుకాలమును స్వల్పముగను; విశేషముగ మూర్ఛనలతోడను; ప్రస్తారములతో ఆలాపనజేసి నాల్గవ విదారితో ముగింపుజేసి మధ్యషడ్జమమునకు వచ్చి నిలుపవలెను. దీనిని చతుర్థరాగవర్ధని అంటారు.

పైన చెప్పినవిధంగా ఈ నాలుగు రాగ వర్ధనులను చేయునప్పుడు, మొదటిదానిలో సంచరించినకాలములో సగముకాలము మాత్రమే రెండవ రాగవర్ధనియును, రెండవదానిలో సగము కాలమును మూడవరాగవర్ధనియునూ, మూడవదానికాలములో సగము కాలము నాల్గవ రాగవర్ధననిన్నీ ఆలాపన జేయుట ఆచారముగా నున్నది. (కొంచెము ఇంచుమించు అయినను యిబ్బంది లేదు.) అటుల కానియెడల రాగము రంజకముగా నుండజాలదని గ్రహించదగును. (ఈ నాల్గువిధములును ముఖ్యములే. అయినను సమయానుకూలముగా కొందరు రెండిటిని మాత్రమే ఆలాపించి ముగించుచున్నారు.)

ఇదియొకపద్ధతియగు రాగాలాపన—తరువాత: స్థాయిసంచారపద్ధతి: అనునది మరియొకపద్ధతి గలదు. ఈ ఆలాపన ఆరోహణస్థాయిసంచారమనియు; అవరోహణస్థాయి సంచారమనియు; రెండు విధములు:—ఈ పద్ధతి అపన్యాసక్రమమునకు భిన్నమైనది కాదు. కాని పూర్వులు కొందరు ప్రత్యేకముగా దీనిని చెప్పారు. సంచారం చెయ్యడంలో ఒక స్వరములో ఆరంభించి తిరిగి ఆ స్వరములోనే ముగిస్తే ఆ స్వరమును స్థాయి అంటారు. ఆరోహణస్థాయిసంచారమంటే, మధ్యస్థాయి షడ్జములో ప్రారంభించి దాని పైస్వరముల నంటక మంద్రస్థాయి షడ్జము వరకును ప్రస్తరించి, (యథాశక్తిగా పంచమమువరకైననూ) తిరిగి మధ్య షడ్జమంలో నిలపాలి. ఇది మధ్యస్థాయిఆలాపన అవుతుంది. ఇట్లే.

మధ్యస్థాయి ఋషభంలో ప్రారంభించి మంద్రస్థాయిఋషభంవరకును సంచరించి తిరిగి మధ్యస్థాయి ఋషభములో న్యాసము జేయవలెను. ఇట్లే గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాద, (తారస్థాయి) షడ్జమువరకు క్రమంగా సంచరించి, ఆయా స్వరములలో తిరిగి న్యాసమును జేయవలెను. ఈవిధముగానే అవరోహణస్థాయిపద్ధతిలో తారస్థాయి షడ్జమును స్థాయిజేసి దాని క్రింది స్వరముల నంటక, ఆ స్వరములోను, ఆ పై స్వరాలలోను సంచరించి, తిరిగి తారషడ్జమంలో న్యాసంజేయాలి. తరువాత నిషాదమును స్థాయిజేసి దానిపై స్వరాలలోనే సంచరించి ఆ నిషాదమందే ముగించవలెను. ఇవ్విధముగనే మిగతాస్వరాలలో పాడి, మధ్యమస్థాయి షడ్జమును స్థాయిజేసుకొని, తారాస్థాయికి పోయి అక్కడనుండి ద్రుతకాలపు సంగతులతో విదారిగా దిగాలి.

*Note* : (ఈ ఆరోహణస్థాయిలు పాడేటప్పుడు ఆయాస్వరాలకుపైగల స్వరాల నుపయోగింపగూడదు.) అవరోహణస్థాయిలు పాడేటప్పుడు ఆయా స్థాయి స్వరాలకు క్రింది స్వరాలను తాకకూడదు.

(సశేషం)

---




# చల్లని చెయ్యి

ఒక మహానుభావుడు ఉరికంబమెక్కుతూ తలారితో ఇలా అన్నాట్ట: "అదిగో, అక్కడికి ఎత్తేవరకే నీకు కష్టం. అకాస్త శ్రమపడ్డావంటే, ఆతరవాత కిందికి రావడం నేను చూసుకుంటాలే." ఇంత నిశ్చయంగా నిశ్చింతగా మృత్యువు నాహ్వానించేవారు చాలా కొద్దిమంది ఉంటారు. మృత్యువుకి భయంకరమైన పేర్లు విశేషణాలు పెడతాం. మృత్యువుకి భయంకరదంష్ట్రలున్నాయనీ, యమధర్మరాజు నల్లగా భయంకరంగా ఉంటాడనీ దున్నపోతు నెక్కి వస్తాడనీ, యమకింకరులు రాక్షసులమాదిరిగా ఉండడమే కాకుండా చీకటిరంగు కలవారనీ ఉచ్చుతాళ్లు బిగించి ఈడ్చుకు పోతారనీ మొదలైన భయోత్పాతమైన కథలు చెప్పుకుంటారు. కాని నిజంగా మృత్యువు భయంకరమైనదికాదు. మృత్యువు చల్లనితల్లి. వయసు మీరి కాటికికాళ్లు చాచుకున్న వారికి తమ చేతులూ కాళ్లు తమ స్వాధీనంలో లేక, "నన్నెప్పు డుద్ధరిస్తావు తల్లీ" అని మృత్యుదేవతని ప్రార్థిస్తారు. (మనపురాణాల్లో యముడు మగవాడైనా, చాలామంది మృత్యువుని తల్లిగానే భావిస్తారు.) రోగపీడితులైనవారిని యాతనలనుంచి ముక్తినిస్తుంది ఆతల్లి. కాని అదేమి పాపమో చావుపేరు చెప్పేసరికి మనుషులు భయపడిపోతారు. అది వచ్చి మింగుతున్నప్పుడు మాటైనా మాట్లాడరు. బ్రతికినన్నాళ్లూ చావుకి భయపడి తీరా చావు ముంచుకువచ్చిన తరవాత చడీ చప్పుడూ కాకుండా, పెళ్లికొడుకు వెంట వెళ్లే పెళ్లికూతురులాగా వెళ్లిపోవడం మనుషులికి మామూలైపోయింది.

అనేక వేలమంది నీటిగండాలవల్ల, గొంతుక పిసికినందువల్ల, ఎలక్ట్రిక్ షాక్ వల్ల చనిపోయినవారున్నారు. అనేకమందిని ఈ గండాలనించి తప్పించగా బ్రతికినవారున్నారు. అలా బ్రతికినవారు చచ్చి మళ్లీ పుట్టారన్నమాట. కొందరు చచ్చిపోయి యమలోకం వెళ్లి, ఈలోగా ఏదో పొరపాటు జరిగిందనుకుని యముడు వెనక్కి పంపెయ్యగా, కాడి ఇంకా శ్మశానం చేరకముందు కాడిపైన లేచిన కూర్చున్నవారున్నట్లు కథలు చెప్పుకుంటారు. అలా బ్రతికినవారిని ఆ లోకం ఎల్లా వుందని అందరూ పీడించడం మామూలు. వారు ఊహాకి తోచినవీ లేనివీ చెప్పడం మామూలు. చావు వచ్చేటప్పుడు బహుశా ఏదో మత్తు ఆవహించవచ్చును. నిద్రపోవాలని తీవ్రమైన వాంఛ కలగవచ్చును. అంతేకాని ఇంక బాధేమీ ఉండదు. ఆ సమయంలో నిజంగా శరీరబాధేమీ లేదనీ, భయంకూడా కలగ లేదనీ గండంగడిచి బ్రతికినవారు చెపుతారు. అంతా ప్రశాంతంగా ఉందని చెప్తారు. కొందరి కొందరికి ఆ కథలూ ఈ కథలూ విన్నందువల్ల అవి జ్ఞప్తికివచ్చి అటువంటి దృశ్యాలు కళ్లకు కట్టవచ్చును. 500 మందిని చనిపోయేసమయంలో సర్ విలియం ఆస్లర్ పరీక్షచేశాడు. అందరిలో పదకొండు మందికి మాత్రమే మనస్సు వికలమయిందట. ఇద్దరికి మాత్రమే భయోత్పాతం కలిగింది.

ఆర్థర్ మాక్డొనాల్డ్ ఇలా వ్రాశాడు: "చావు సమీపించినప్పుడు మనిషి బాధపడతాడనే భ్రమ కలగడానికి ఒక హేతువుంది. చనిపోనున్న మనిషిముఖం వికృతంగా ఉంటుంది. కొందరు చేతులూ కాళ్లూ కదుల్చుతారు. కొందరు డొక్కలెగరవేస్తారు. కాని ఇవి నిజంగా మనిషి పడుతున్న బాధలకి లక్షణం కావు. చావు వచ్చేసమయంలో ప్రకృతి స్తంభించిపోతుంది. మనిషిసహజలక్షణాలు మాయమౌతాయి. రోగం ప్రకృతిని జయించిందన్నమాట (జబ్బులు వచ్చినప్పుడు జబ్బుల్ని మనిషిశరీరప్రకృతి జయిస్తుంది.) యుద్ధం పూర్తిఅయ్యేసరికి శరీరానికి పూర్తిగా ఆయాసం వచ్చేస్తుంది. శరీరానికి సహజమైన ప్రకృతి కళ్లు మూసుకుంటుంది. అప్పుడు శరీరం చావుకి సిద్ధపడుతుంది. అప్పుడు సర్వం శాంతిమయంగా ఉంటుంది."

డా॥ జాన్. ఏ. రైల్ ఇల్లా వ్రాశాడు: "చావంటే మనకి చెప్పేనంత భయంకరమైనదికాదు. వాస్తవానికి చూసేవాళ్లమనో వ్యథే అధికంగా ఉంటుంది. రోగి బాధపడుతున్నాడని ఊహిస్తారు. తామే ఆ స్థితిలో ఉంటే ఎంతబాధగా ఉంటుందో ఊహించుకుని, అంతబాధను రోగి లోనౌతున్నాడని భ్రమపడి చూసేవారు తల్లడిల్లిపోతారు. కాని ఇదంతా భ్రమ. మరణ మాసన్నమైనప్పుడు రోగి బంధుమిత్రులవద్ద సెలవు తీసుకోవాలని తలచవచ్చును. అప్పుడు ఏవో హృదయవిదారకమైన తలపులు పొడగట్టి అది ముఖంలో ద్యోతకం కావడం కద్దు. కాని మృత్యు వాసన్నమైనప్పుడు ఏబాధకాని, భీతిగాని కలగవు."

డా॥ ఆల్ఫ్రెడ్ వుర్సెస్టర్ ఇలా అన్నాడు: "చావు ముంచుకువచ్చే క్షణంలో ప్రతివారికీ చావుపైన కాంక్ష కలుగుతుంది. మానవుడు సంతృప్తితో మృత్యువు నాహ్వానిస్తాడు. అన్యథా జరగడం నేనెన్నడూ చూడలేదు. ఆఖరు క్షణంలో మృత్యువెప్పుడు సులువుగానే వస్తుంది. చావుకి ముందెంత బాధపడినా ఎంత మనోవ్యథకు గురైనాసరే, ఆబాధలకీ, చావుకీమధ్య ప్రశాంతమైన విశ్రాంతిఘడియ లుంటాయి. కొందరికి మృత్యు వాసన్నమైనప్పుడు అపూర్వమైన సుఖానందాలు లభిస్తాయి.

"మరణబాధ అనేది మనుషుల ఊహాలో తప్ప వాస్తవంగా ఉండదని వైద్యశాస్త్ర నిపుణులు అంగీకరిస్తారు. శరీరంలో కదలికలు, ముఖంలోని వికారాలు చూసేవారికి భీకరంగా ఉండవచ్చును.

రోగిపడుతున్న బాధకి అవి సూచనలను కుంటారు. కాని అవన్నీ కండరాలు బిగువౌతున్నందువల్ల కనిపించే మార్పులేకాని బాధవల్ల జనించినవి కావు." ముఖవికారాలు నిద్రలో ఉన్నప్పుడుకూడా కానవస్తాయి. కాని వాస్తవంగా నిద్రపోతున్న మనిషి బాధపడదన్న విషయం మనకి తెలుసును. అదే మాదిరిగా మృత్యుసమీపంలో జరుగుతుంది.

చావంటే ఎలా ఉంటుందో తెలుసుకోవాలంటే చచ్చి బ్రతికిన డాక్టర్లు చెప్పాలి. ఒక డాక్టర్‌కి గుండె నొప్పి తీవ్రంగావచ్చి చావు దగ్గరికి వచ్చింది. అప్పుడెల్లా వుందని అడగ్గా, ఏదో మత్తుగా ఉందన్నాడు. కాని అతని ముఖంచూస్తే విపరీతంగా బాధపడుతున్నట్లు కనిపించాడు.

ఒక డాక్టర్‌కి న్యూమోనియా జ్వరం వచ్చి చచ్చినంత పనయింది. పెద్ద బాధపడుతున్నట్లు కనిపించాడు తరవాత అడిగితే అసలే బాధకలగలేదని చెప్పాడు. ప్రమాదావస్థ తప్పినంతవరకూ ఏమి జరిగిందో అతనికసలేమీ తెలియదు. ప్రమాదం గడవగానే మంచంమధ్య కూర్చుని అన్నం పెట్టమని దబాయిస్తున్నాడు.

నీటిలో మునిగి స్మృతితప్పి పడిపోయి, వైద్యసహాయంవల్ల బ్రతికిన ముగ్గుర్ని అడగ్గా వారికేమి జరిగిందో తెలియదని చెప్పారు. కొంతసేపు గిజగిజా కొట్టుకున్న తరవాత అంతా ప్రశాంతంగా సుఖంగా ఉన్నట్లుంది. పద్దెనిమిదో శతాబ్దంలో శరీరశాస్త్రపరిశోధన జరిపిన విలియం హంటర్ చనిపోతూ చనిపోతూ ఇలా అన్నాట్ట: "నాకే కలం చేతపట్టి వ్రాయగల సత్తువఉంటే, చనిపోవడం ఎంత సులువుగా హాయిగా ఉంటుందో వ్రాసేవాడిని." ఫ్రెంచికవి పాల్‌స్కారన్ కూడా ఇదేమాదిరిగా చనిపోయేముందు అన్నాడు. "నాకే తిరిగి ప్రాణం పోస్తే చావునిగురించి చక్కని వ్యంగ్యవ్యాసం వ్రాసి ఉండేవాడిని" అన్నాడు. చావుని చూసి ఇలా నవ్వగలన్న సంగతి తెలియలేదే అని తెల్లబోయాడట.

ఆగిపోతూ ఆగిపోతూ ఉండే గుండెలో రక్తప్రసారం క్రమక్రమంగా నిలిచిపోతుంది. ప్రాణదీప్తి క్రమక్రమంగా కాంతి తరిగిపోతుంది. రోగి తుదిక్షణాల్లో ఏమి బాధపడతాడో అది అతనికి తెలిసిరాదు. బుద్ధితో బాధలు తెంచుకున్న శరీరంలో నరాలు ఎంతమార్పులు పొందినా మనిషికి తెలియరాదు. ఇంద్రియాల గ్రహణశక్తి మాయమైపోతుంది. మెనింజైటిస్, టెటనస్ వంటి భయంకరవ్యాధులవల్ల పీడింపబడినవారికి కూడా తుదిక్షణాల్లో శరీరబాధనుంచి దయతో ముక్తినిస్తుంది మృత్యువు. ఈరీతిగా కొంత విశ్రాంతి నిచ్చినతరవాత రక్తప్రసారస్తంభనంతో తరిగిపోయే ప్రాణవాయుపోషణ మెదడుకికూడా లోపమైపోతుంది. అంతతో మనిషికిబుద్ధి అంతరిస్తుంది. ఆసమయంలో లేని ధ్వనులూ, చెప్పని మాటలూ, వినిపించవచ్చును. లేని వెలుగులు, మెరుపులు, కాంతి కనిపించవచ్చును. కొద్దిగా శాంతిభంగం కలగవచ్చును. క్రమక్రమంగా అంధకారంలో పడిపోతాడు. నిద్రపట్టేముందు ఆవరించే అంధకారంవంటిదే, మృత్యువు ఆవహించే క్షణంలోకూడా ఆవరిస్తుంది. కొందరు కొందరు వృద్ధులు మామూలుగా నిద్రపోయి నిద్రలోనే ప్రశాంతంగా శాశ్వత నిద్రపోవడంకూడా సంభవిస్తూఉంటుంది. అటువంటివారినిద్రకి మృత్యువుకీ ఎటువంటి వ్యత్యాసమూ ఉండదు. పసిబిడ్డల విషయంలోకూడా అంతే. సర్వసామాన్యంగా సులువుగా బాధపడకుండా మృతిచెందుతారు.

చనిపోయేసమయంలో కొందరికి చిట్టచివరివరకూ తెలివి ఉంటుంది. అప్పుడే ఆ మనుషుల అసలు స్వభావంకూడా వ్యక్తమౌతుంది. జీవితంలో నిత్యం తగవులాడే వారు ఆఖరుక్షణంలో తెలివిఉంటే విషం కక్కుతూ మాట్లాడతారు. తమకి సంభవించబోయే గతినిగురించి వాపోతారు. దయార్ద్రహృదయులైనవారు సద్బుద్ధి కలవారూ అయితే, చనిపోయే క్షణాల్లో ఆ స్వభావమే కనపరుస్తారు. చనిపోయేటప్పుడు మనుషుల ఆలోచనలు తేటగా ఉంటాయి. ఎభైయ్యేళ్లుగా తానసహ్యించుకున్న గ్రీక్ గీతాల్ని గెటేమహాకవి అంత్యఘడియల్లో పఠించాడు.

మృత్యువంటే భయపడవలసిన అగత్యం లేదు. పుక్కిటికథలు మనకు చెప్పేటంత భయంకరంగా ఉండదు మృత్యువు.

కొత్తగా బడిలో చేర్చినప్పుడు విద్యార్థి పాఠశాల ప్రాంగణంలో నిలిచి చూసి తనకు తెలియని అనుభవాల్ని తల్చుకుని వెనుకంజ వేస్తాడు. ముక్కుముఖం తెలియని యువకుని వివాహంచేసుకున్న నూతనవధువుకు భవిష్యద్గృహజీవనం ఏదో మాయావాగురంలా గోచరిస్తుంది. మనస్సు సుఖదుఃఖాలలో పడి కల్లోలితమౌతుంది. ఆ విద్యార్థినీ, ఈ నూతనవధువునీ చూసి అనుభవజ్ఞులు చిరునవ్వు నవ్వుతారు. అదేమాదిరిగా మృత్యుగహ్వరం ప్రవేశించబోతున్న మనిషినిచూసి మనం వ్యథపడవలసిన అవసరం ఉండదు. పగలెల్ల పరిశ్రమచేసి ఇంటికి వచ్చేవారికి నిద్ర ఏరీతిగా శ్రమ నపనయిస్తుందో, బ్రతుకులో పాటుపోటులనుంచి మృత్యువు మనిషికి విశ్రాంతి సుఖాన్నిస్తుంది. ఈబాధావిముక్తి దాక్షిణ్య చిహ్నం కాదా!

[లిబర్టీ పత్రికలో ఒక వ్యాసం ఆధారంగా వ్రాసినది.]



అమెరికాలోని భారత రాయబారి శ్రీమతి విజయలక్ష్మీపండిట్‌గారికి వెల్లెస్లీ కళాశాలవారు 'న్యాయశాస్త్ర ప్రవీణ' బిరుదాన్ని బహూకరించిన దృశ్యం.

# షేక్స్పియర్

(8 వ-పేజీ తరువాయి)

జేమ్సు I సింహాసనానికి రాగానే వీళ్ల నాటకం థియేటరును, రాయల్ (ప్రభుత్వ) నాటకంథియేటరుగా చేసుకొన్నాడు. "లారెన్సుఫ్లెచ్చర్, విలియం షేక్స్పియర్, రిచర్డు బర్బేజి జాన్ హెమ్మింగ్, వీరి అనుయాయులకు" నాటకాలాడేందుకు, నటులుగా పేరుపొందేందుకు అధికారము, లైసెన్సు ఇంగ్లండు రాజు 1603 లో ఇచ్చాడు. షేక్స్పియర్‌కు ఈ నాటకం కంపెనీలలో, షేర్లు, మేనేజిమెంటు అధికారాలూకూడా ఉండేవి. నాటకాలాడినందువల్ల భాగ్యవంతుడు కాగలిగాడు షేక్స్పియర్ రెండు వేషాలు వేయగా చూసినవారి వ్రాతలుకూడా దొరికాయి. హేమ్లెటులో "ఘోస్టు"వేషమూ, "యాజ్ యు లైకిట్" నాటకంలో వృద్ధసేవకుని వేషమూ వేశాడు.

తన నాటకాలను స్వయంగా ఆడించుకొంటూ, కావల్సిన చిన్న చిన్న వేషాలన్నీ ఎచ్చెరికం లేకుండా వేస్తూవచ్చిన మహానటుడు, రంగస్థలనేతగా, ప్రవర్తించినవాడు "షేక్స్పియర్" అని ఇట్టే ఊహించుకోవచ్చును.

లండన్‌లో ఉంటూ ఏటేటా కొన్నాళ్లు స్వగ్రామానికి వచ్చి, విశ్రాంతి తీసుకొంటూ ఉండేవాడు. నాటకాలు అక్కడే వ్రాసేవాడో, లేక లండన్ ఇటుకబిళ్లల్లో, రంగస్థలం సమీపంలోనే వ్రాస్తూవుర్చునేవాడో చెప్పలేము.

ఆనాటకాలన్నీ యథాతథంగా మిగలాలని పెద్దప్రయత్నాలు చేసినట్టుకూడా కనబడదు. ఏయేనాటకాలు ఏ సంవత్సరాలలో రాశాడో, అన్నిటివిషయంలోనూ సరిగ్గా నిర్ణయించటమూ కష్టమే. రానురానూ ఆ నాటకాలూ పరిపక్వం పొందుతూ, మంచి పాకంలో పడుతూవచ్చాయని, ప్రతిభను ఇనుమడించుకొంటూ వచ్చాడనే మాత్రం తెలుస్తుంది.

లండన్‌లో కొన్నాళ్లు వృత్తిలో ఉన్నాక భాగ్యవంతుడయ్యాడు. ఒక్క గ్లోబ్ థియేటరులోనేగాక ఇతరవ్యాపారాలలో షేర్లు కూడా ఉండేవి. సాహిత్యంవల్ల భాగ్యవంతుడయినవాడు ఇంగ్లండులో షేక్స్పియరే ప్రప్రథముడంటారు. 1597లో స్వగ్రామంలో మంచి యిల్లు కొన్నాడు. 1602 లో ఇంటికి దగ్గిరలో 107 ఎకరాల భూమిని కొన్నాడు. చివరిరోజులలో స్వగ్రామంలో ఊరిపెద్దలలో ఒకడుగా గౌరవ మందుకొంటూ సంపత్సమృద్ధమైన జీవితం గడుపుకొన్నాడు 1604 ప్రాంతంలోనే లండన్‌నుంచి స్వగ్రామానికి వచ్చాడంటారు. కాని 1803 దాకా గ్లోబ్ థియేటర్ నాటకాలలో వేషాలు వేస్తూన్నట్లు నిదర్శనా లున్నాయి. 1604 లో ప్లేగువ్యాధివల్ల లండన్ థియేటర్లు మూశేశారు. అప్పటినుంచే బహుశా షేక్స్పియర్ స్వగ్రామంలోనే ఇంటిపట్టు నఉండే తక్కిన నాటకాలు వ్రాసి పంపించుకొంటూ కూర్చున్నాడట. ఏడాదికి రెండునాటకాలచొప్పున పెద్దవయస్సులోకూడా లండన్ నాటకరంగానికి నాటకాలు వ్రాసిపంపించేవాడు.

కుటుంబంలో విశేషాలుకూడా అతని జీవితంలో కొన్నిమార్పులు తెచ్చిఉండవచ్చు. 1601 లో అతనితండ్రి చనిపోయాడు. 1607 లో కుతురు సుసన్నా పెళ్లిచూశాడు. అదేఏడాదే, తనరీతి నటుడైన తమ్ముడూ, ఇరవైఏడేళ్ల వయసున చిన్నతమ్ముడు ఎడ్మండు చనిపోయాడు. 1612 లో తక్కిన తమ్ముళ్లు ఇద్దరూ చనిపోయారు.

షేక్స్పియర్ సమకాలికులంతా, అతని సౌజన్యాన్ని, మధురభాషణను, స్నేహపాత్రతనూ, ఉదారస్వభావాన్ని అమితంగా మెచ్చుకున్నారు. చూడ సొంపైన వాడంటాడు ఆబ్రే. అతనితో మాట్లాడటంబహు ఆహ్లాదకరంగా ఉండేదని, ఆనాటిమహాకవులైన బెన్‌జాన్‌సన్ మొదలైన వారంతా చెప్పుకొన్నారు.

సర్వజనప్రియుడు చివరి లొమ్మిదేళ్లూ స్వగ్రామంలో బహుశాంతంగా మహారచనలు సాగించుకొంటూ సుఖజీవితం గడుపుకొన్నాడు విలియం షేక్స్పియర్.

1616 సంవత్సరం ఏప్రియల్ 23 తేదీని, ఈ మహాకవి స్వగ్రామంలో, శాంతవాతావరణంలో దివంగతుడయ్యాడు. అతని జన్మవల్ల ప్రపంచసాహిత్యం ధన్యమయి భవిష్యత్తులోకూడా సాహిత్యాన్ని పుష్టివంతంగా పెంచుకొనేందుకు కావలసిన బీజాలను సమకూర్చుకొంది.

---

# మన దేశం

(6 వ-పేజీ తరువాయి)

రూపాయలతోనే ఉభయదేశాలవారూ ఎగుమతి దిగుమతి వ్యాపారాలు నిర్వహించాలని నిర్ణయమయింది. ఎరమిదిలతుల బేళ్లు ముడి జనుము భారతదేశానికి పాకిస్తాన్ అమ్మడానికీ, వస్త్రం, ఇనుము మొదలైన వస్తువుల్ని భారతదేశం పాకిస్తాన్‌కి అమ్మడానికీ అంగీకరించబడింది. పండిట్ నెహ్రూ ఈ వారం రెండురోజులు కరాచీ వెడుతున్నారు. అక్కడ ఈ వాణిజ్యపు టొడంబడికపైన వారు లియాఖత్ అలీఖాన్‌తో చర్చించగలరు. ఈ ఒడంబడిక 1950 జూలై 31 వరకే అమల్లో ఉంటుంది.

## పార్లమెంట్ సమావేశం *

భారతరిపబ్లిక్ పార్లమెంటు ప్రథమ సమావేశం ఏప్రిల్ 20 వ తేదీతో ముగిసింది. బడ్జెట్ కాక, భీమాశాసనం, కార్మిక శాసనాలు, వ్యక్తినిర్బంధశాసనం మొదలైనవి చర్చించబడినాయి. ఆయారాష్ట్రాలకు వాని శాసనసభల్లోనూ కేంద్రపార్లమెంటులోనూ ఎంతెంత ప్రాతినిధ్యం ఇవ్వబడాలో ఒక శాసనంద్వారా నిర్ణయించబడింది. రాజ్యాంగంలో సూచనప్రకారం చెన్నరాష్ట్రశాసనసభలో జనాభానుబట్టి 384 మంది సభ్యు లుండాలి. కాని సంఖ్య మరీ అధికమైనందువల్ల కొన్ని మార్పులు చెయ్యబడినాయి. చెన్నరాష్ట్రశాసనసభలో 300 మంది సభ్యులే ఉండాలని మొదట నిర్ణయించబడింది. కాని చెన్నరాష్ట్రప్రభుత్వం అధికప్రాతినిధ్యం కోరినందువల్ల 375 మంది సభ్యు లుండవచ్చునని సవరించబడింది. భారతరిపబ్లిక్‌లో సంయుక్తరాష్ట్రాల అనంతరం పెద్ద శాసనసభ చెన్నరాష్ట్రానిదే. అయితే ప్రతినిధులసంఖ్య ఎక్కువైనంత మాత్రంచేత ప్రభుత్వానికి ఖర్చు అధికమేగాని ప్రయోజన మేదైనా ఉందా అంటే అది సందేహమే. [సీతారామ్]

---

# స్వామీజీ

(గల్పిక)

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

"పెద్దవాళ్ళను అట్లా అనగూడదురా, కుంకవెధవా! కళ్లు కాస్తా పోచవి. అందులో స్వాములారు సామాన్యుడు కాడు. ఆయన త్రికాలవేది. ఆయన ఆజ్ఞ లేకుండా ఎక్కడా ఏమీ జరగదు" అన్నది అమ్మమ్మ.

"దానికి రుజువేమిటి, అమ్మమ్మా? స్వామీజీ మనకు కావలసిందేదన్నా చేస్తాడా?" అన్నాడు మనమడు.

"అట్లా ఎందుకు చేస్తాడూ? తన కిష్టమైనవే చేస్తాడు."

"అయితే మొన్న మనవూళ్లో ఇళ్లు తగలబడింది ఆయన మూలంగానేనా?"

"వాళ్లు చేసుకున్న కర్మపరిపాకం కొద్దీ వాళ్ల కొంపలు కాలినవి!" అన్నది అమ్మమ్మ.

"అయితే మధ్య స్వామీజీ చేసే దేమిటీ?"

"ఎవరి పాపానికి తగ్గట్టు వారికి శిక్ష ఇవ్వటమే."

"ఆయనే ఇస్తున్నాడని నీ కెట్లా తెలుసు?"

"తెలీదా ఏమిషి? అన్నమంతా పట్టి చూడాలా?"

"పోనీ కొంత పట్టి చూశావుగా, చెబుమా?"

"కమలమ్మ కొడుకు రాఘవయ్య కేమయిందీ? బయల్దేరి రమ్మని స్వామివారు కబురుచేస్తే రాలేదు. మూడో నాటికల్లా మూడొందలూ చోరీ అయిందా లేదా?"

"నిన్న నాది అణా పోయింది. స్వామీజీయే కాజేసి ఉంటాడా, అమ్మమ్మా."

"ఛీ! అప్రాచ్యుడా! అప్రాచ్యంగా వాగుతావు!"

"అంతలో ప్పడతావేం? రోజూ ఎక్కడో క్కడ దొంగతనాలూ, హత్యలూ జరుగుతూనే ఉన్నాయిగదా. ఇదంతా స్వామీజీయే చేస్తున్నాడంటావా? కమ్యూనిస్టులు కొన్ని పనులు చేస్తున్నట్టు పత్రికల్లో రాస్తున్నారే. వట్టిదేనా?"

"పత్రికలవాళ్ళ కొకటి తెలిసేడిచింది కనక నా? ఈ గొప్పగొప్పవిషయాలు వాళ్లకేం తెలుస్తవిరా?"

"పోనీ, నువు చెప్పు. ఇంకేం చేశారు, స్వామీజీ?"

"ఒకటా? కాంతారావు కంత పెద్ద ఉద్యోగం ఎట్లా అయింది?"

"ఆ ఉద్యోగానికి వాడు ఆరునెల్లకిందే దరఖాస్తు పెట్టాడు, అమ్మమ్మా?"

"ఆరునెల్లనుంచీ కాని ఉద్యోగం స్వాములారు వాళ్లింటి గడపతొక్కిన మర్నాడే కావటమేం?"

"ఉద్యోగం ఇస్తూ ఆర్డరుపడేనాటికి స్వామీజీ ఇంకా గడప తొక్కలేదే?"

"ఏడిశావు, కుర్రకుంకవు! నీ కివేం తెలుస్తవిరా?"

"ఇంకా చెప్పు, అమ్మమ్మా! స్వామీజీ లీలలు విన్నకొద్దీ ముచ్చటగా ఉన్నాయి."

"ముచ్చటగా ఉండవూ? ఆ సత్తెన్నారాయణ ఇట్లాగే నవ్వాడు. అందుకే వాడెక్కిన రైలు కాస్తా అంత పాటుపడింది."

"మొన్న సూళ్ళూరుపేటదగ్గిర పడిపోయిన ఎక్స్‌ప్రెస్ బండే?"

"కాదుట్రా మరీ?"

"స్వామీజీ పడగొట్టిందే?"

"ఏం, ఆయన కిదొక లెక్కనుకుంచున్నావా?"

"అయితే ఉండు, అమ్మమ్మా! పోలీసు వాళ్లకు ఇప్పుడే ఉత్తరం రాస్తాను?"

"ఏమనీ?"

"రైలు పడగొట్టింది ఎవరో తెలీక పోలీసులు అల్లాడిపోతున్నారు. స్వామీజీ చేసినట్టు వాళ్లకు చెబితే చాలా సంతోషిస్తారు. బహుమానంకూడా ఇస్తారు నాకు."

"చాల్లే, ఊరుకో!...వోరే, నిజంగా రాతామనే? పెట్టక్కడ కాగితాలూ, కలమూ!...చెబుతుంటే వినవుట్రా? పురుగులు పడిపోచావు సుమా!...స్వామివారికి కోపంవస్తే దుంప నాశనమైపోచుందే!... ఊరుకోరా! నీతో ఎందుకు మాట్లాడానురా?"

"ఆ స్వామీజీ మాట్లాడించి ఉంటాడులే అమ్మమ్మా! స్వామీజీ నన్నెందకు భస్మం చేస్తాడూ? ఎరెస్టు చెయ్యబొయ్యే పోలీసుల్ని భస్మీపటలం చేస్తాడు. చూద్దాం, ఎవరు గెలుస్తారో?"

"పోలీసు లేం చేస్తార్రా స్వాములార్ని?"

"చేతికి సంకెళ్లువేసి పెడరెక్కలు విరిచి నోట్లో గుడ్డలు కుక్కి లాక్కుపోతారు."

"వాళ్ల చేతులు పడా! అంతపని చేస్తారుగా?...నాయన్నాయన, ఆ ఉత్తరం రాయకురా! నీకు పుణ్యం ఉంటుంది! నువ్వా ఉత్తరం రాస్తే నాకు పుట్టగతు లుండవురా!"

"అసలు భయం అదా?...పోనీగాని, అమ్మమ్మా, స్వామీజీమీద నీకంత నమ్మకం ఉందే, పోలీసులమీద ఉన్నంతగా స్వామీజీమీద లేదేం?" అన్నాడు మనమడు, కాగితాలూ కలం అవతలపెట్టేస్తూ...

"స్వామివారంటే ఏమనుకుంటున్నావు, పున్నమ్మా?...ఇవాళపొద్దున మా మనమడు ఆయన్ను పోలీసులకు పట్టిస్తానని ఉత్తరం రాయబోయినాడు. అంతలో వాడిలో ఏం మార్పు కలిగించారో స్వామివారు. తీసిన కాగితాలూ, కలమూ అట్లాగే పెట్టేశాడు! అంతా స్వామివారి మహిమ!" అన్నది అమ్మమ్మ.

---

# నేటిప్రపంచం

★

## ఇండొనీషియా జాతీయైక్యత *

జాతీయస్వాతంత్ర్యం లభించగానే జాతీయైక్యతా సాధన భారతదేశంలోవలెనే ఇండొనీషియాలోకూడా ప్రధాన సమస్యయింది. భారతదేశంలో పోలీసుచర్యతోగాని హైదరాబాద్ లొంగిరాలేదు. కాశ్మీరంలో పాకిస్తాన్‌తో యుద్ధం సంభవించినందువల్ల అది అంతర్జాతీయసమస్యగా మారింది. కాశ్మీర్‌తప్ప తదితరసంస్థానాలన్నీ యూనియన్‌లో చేరిపోయినాయి. బ్రిటిష్ రాజనీతితంత్రజ్ఞులకి భంగపాటయింది. ఇదేరీతిగా ఇండొనీషియాలో ఎన్ని నిరోధాలేర్పడుతున్నప్పటికీ, యూరోపియన్లు ఎన్ని కుట్రలు పన్నుతున్నప్పటికీ, ఇండొనీషియన్ రిపబ్లిక్ ప్రభుత్వం ప్రజలతోడ్పాటుతో అన్నిటినీ అతిక్రమించి దేశసమైక్యతను సాధించగలుగుతోంది. పశ్చిమజావాలోనూ, తూర్పు ఇండొనీషియాలోనూ సంభవించిన తిరుగుబాట్లు క్షణం నిలువలేకపోయినాయి. న్యూగినీపై పరిపాలనాధికారంవిషయంమాత్రం డచ్చి, ఆస్ట్రేలియన్ ప్రభుత్వాలతో పరిష్కారం కావలసి ఉంది.

పశ్చిమజావాలోనూ తూర్పుఇండొనీషియాలోనూ తిరుగుబాట్లు సంభవించాయి. రెండుపర్యాయాలూ రిపబ్లిక్ ప్రభుత్వం కఠినవిధానం అవలంబించగానే సంఘర్షణేదీ లేకుండానే కూలిపోయినాయి.

ద్వితీయ ప్రపంచయుద్ధానంతరం జావాలో స్థాపించబడిన రిపబ్లిక్‌పైన డచ్చి సైన్యాలు దాడిచేసినప్పుడు, రిపబ్లిక్ ప్రభుత్వానికి ప్రత్యర్థులుగా పశ్చిమజావా, తూర్పుసుమత్రా సెలిబిస్ మొదలైన ప్రాంతాలలో ప్రత్యేక ప్రభుత్వాలను డచ్చివారు తమ ఆధ్వర్యం క్రింద స్థాపించారు. హేగ్ ఒడంబడిక అనంతరం ఎలాగైనా ఇండొనీషియన్‌రిపబ్లిక్ ప్రభుత్వాన్ని బలహీనపరిచి తమ ప్రాబల్యాన్ని కాపాడుకోవాలనే ఎత్తుతో, డచ్చి రాజనీతిజ్ఞులు, సైనికాధికారులు కుట్రలు పన్నారు. ఈ కుట్రల్లో డచ్చిప్రభుత్వానికి స్వయంగా ప్రమేయంలేదు. కాని డచ్చి సైనికాధికారుల్ని అదుపులో పెట్టినట్లయితే ఈ కుట్రలకి అవకాశం లేకపోయేదే.

ఇండొనీషియన్ రిపబ్లిక్ స్థాపించబడినది మొదలు వివిధప్రాంతాల్లో డచ్చివారు రిపబ్లిక్‌కు విరుద్ధంగా విషప్రచారం చేస్తూనే ఉన్నారు. పశ్చిమజావాలో మహమ్మదీయమతావేశపరుల్ని పురికొల్పి ఇండొనీషియాలో మతప్రధానరాజ్యాంగం స్థాపించాలనే మిషతో రిపబ్లిక్‌పై కుట్ర పన్నారు.

కాని ఈమతప్రచారానికి ప్రజలు లొంగలేదు. డచ్చివారిపరిపాలనకాలంలో వారి ఆధ్వర్యంక్రింద నిర్మించబడిన డచ్చి ఇండొనీషియన్‌సైన్యాల్ని స్వాతంత్ర్యం అనంతరంకూడా తమఅధీనంలోనే పెట్టుకుని రిపబ్లిక్‌ప్రభుత్వంపైన తిరుగుబాటుకి పురిగొల్పారు. డచ్చి ఇండొనీషియన్‌సైన్యంలో సైనికులందరూ ఇండొనీషియన్లే పెద్ద ఆఫీసర్లుమాత్రం డచ్చివారు, డచ్చివారి నియామకంలో ఉన్న యూరోపియన్, టర్కిష్ జాతీయులు. మొదట పశ్చిమజావాలో దారుల్ - ఇస్లామ్ అనే పేరుతో ముస్లిం మతప్రధాన సంస్థనొకదాన్ని ప్రోత్సహించారు. డచ్చి ఇండొనీషియన్ సైన్యం తమ అధీనంలోనే ఉన్నందువల్ల ఇండొనీషియన్ సైనికుల్ని తమ ఇష్టంవచ్చినట్లు ఉపయోగించుకోడానికి ప్రయత్నించారు. పశ్చిమజావాలో పొంటియానక్ సుల్తాన్‌కు ఆశ చూపి రిపబ్లిక్‌ప్రభుత్వంపై తిరుగుబాటుకు పురిగొల్పారు. ఆ సుల్తాన్ రహస్యంగా కుట్ర పన్నాడు. వాస్తవానికి ఈ కుట్రకి నాయకుడు టర్కిష్ జాతీయుడైన వెస్టర్లింగ్. ఈనాడు అరబ్ రాజ్యాల సైన్యాలలోనూ పాకిస్తాన్ సైన్యంలోనూ థాయిలండ్, బర్మా మొదలైన దేశాలసైన్యాలలోనూ ఇటువంటి పాశ్చాత్య సైనికోద్యోగులు ఉద్యోగాలు సంపాదిస్తారు. వీరికి ముఖ్యంగా బ్రిటిష్‌రాయబారులు సహాయపడి పెద్దపెద్ద సైనికోద్యోగాలిప్పించి, అవసరమైనరీతిని వారి నుపయోగించుకుంటారు. ఫారెన్ లీజెన్స్‌లోచేరి సైనికశిక్షణ పొంది ఆసియాలోని దేశాల్లో ప్రభుత్వసైన్యాలలోనూ, ఇతర సంస్థలలోనూ వీరు చేరతారు. బర్మాకు స్వాతంత్ర్యమిచ్చి బ్రిటిష్ సైన్యాలు దేశాన్ని విడిచిపోయినప్పటికీ వారి మిలిటరీఆఫీసర్లు బర్మాను విడిచిపెట్టలేదు. బ్రిటిష్ సైనికోద్యోగు లనేకమంది బర్మాలోని క్రైస్తవ మతస్థులైన కరెన్లతోచేరి అంతర్యుద్ధం ప్రారంభించి బర్మాప్రభుత్వాన్ని బలపరిచారు. దీనివల్ల బర్మాలోని బ్రిటిష్ బియ్యపు వర్తకం వారిచేతుల్లోనే ఉండిపోయింది. బర్మా బియ్యపువర్తకం వారి గుత్తగానే ఉండిపోయింది.

ఇదేరీతిగా బ్రిటిష్‌పౌరసత్వం సంపాదించిన వెస్టర్లింగ్ బ్రిటిష్‌గూఢచారివర్గంలో చేరి, బ్రిటిష్ రాయబారిసహాయంతో డచ్చి ఇండొనీషియన్ సైన్యంలో పెద్ద ఉద్యోగిగా చేరి పొంటియానక్ సుల్తాన్‌కు కుడిభుజమైనాడు. వాస్తవానికి ఆ సుల్తాన్ వెస్టర్లింగ్ చేతిలో కీలుబొమ్మ. పశ్చిమజావాలో వెస్టర్లింగ్ ఆధ్వర్యంక్రింద డచ్చి ఇండొనీషియన్ సైన్యాలు తిరుగుబాటు చేశాయి. హేగ్ ఒడంబడికప్రకారం డచ్చి ఇండొనీషియన్‌సైన్యదళాల్ని రద్దుపరచవలసి ఉంది. డచ్చి ఇండొనీషియన్ సైనికుల్లో రిపబ్లిక్‌పట్ల విధేయులుగా ఉండగలిగేవారిని చేర్చుకోగలరని రిపబ్లిక్ విదేశాంగమంత్రి డాక్టర్ సుల్తాన్ ప్రకటించాడు. ఈ ప్రగతివల్ల డచ్చి ఇండొనీషియన్ సైనికులకు అసంతృప్తి కలిగిందని సాకు చెప్పి వెస్టర్లింగ్ తిరుగుబాటుచేశాడు. ఇదేరీతిగా తూర్పుఇండొనీషియాలో డచ్చి ఇండొనీషియన్‌సైన్యాల తిరుగుబాటుకూడా పురిగొల్పబడింది.

తూర్పు ఇండొనీషియాలో తిరుగుబాటుదార్లకి మరొక సాకు దొరికింది. ఇండొనీషియా నంతటినీ ఏకంచెయ్యాలనే ఉద్దేశంతో, జాతీయైక్యతాభావం లోపించిన ప్రాంతాలకు డాక్టర్ రిపబ్లిక్‌లో చేర్చి, మిగతా రిపబ్లిక్‌లతో ఫెడరేషన్ స్థాపించాలని రిపబ్లిక్ ప్రభుత్వం కృషి చేస్తోంది. డచ్చివారి ఆధ్వర్యంక్రింద సెలిబిస్ మొదలైన 300 ద్వీపాలను చేర్చి స్థాపించబడిన తూర్పు ఇండొనీషియా రిపబ్లిక్ స్వపరిపాలనను రద్దుపరిచి డాక్టర్ రిపబ్లిక్ చేర్చనున్నారనీ, ఆవిధంగా చేర్చడం తూర్పుఇండొనీషియాప్రజలకు ఇష్టంలేదనీ ప్రచారం చేశారు. ఈ కుట్రకి

నాయకుడు ద్వితీయ ప్రపంచయుద్ధంలో బ్రిటిష్ వైమానికుడుగా పనిచేసిన కెప్టెన్ అబ్దుల్ అజీజ్.

వాస్తవానికి ఈ రెండు తిరుగుబాట్లలోనూ తిరుగుబాటుదార్లకి ప్రచారబలం తప్ప అన్య బలమేదీ లేదు. రోడ్లరవాణా బొత్తిగా లోపించి సమాచారం ప్రచారమయ్యే సౌకర్యాలు బొత్తిగా కొరవడగా ఉన్నందువల్ల ఏ ప్రాంతాలలోనివారికి వారి అధికారులు చెప్పిన సమాచారమే. కాని సత్యాన్ని స్వయంగా తెలుసుకునే అవకాశం ప్రజలకు లేదు. అందువల్ల మొదట కొంత అంతరాయం ఏర్పడినా రిపబ్లిక్ ప్రభుత్వం క్రమక్రమంగా తమ సందేశాన్ని ప్రజల్లో వ్యాపింపచేయగలిగింది. దీనితో పశ్చిమజావాలోనూ, తూర్పుఇండొనీషియాలోనూ తిరుగుబాటు సంభవించినా వెన్వెంటనే సంఘర్షణ లేకుండా తిరుగుబాటుదార్లు లొంగిపోక తప్పిందికాదు. వెస్టర్లింగ్ ఇండొనీషియా విడిచి పారిపోయాడు. సింగపూర్‌లో చిన్న నేరానికి బ్రిటిష్ అధికారులచేత కారాగారవాస దండన పొందాడు. పాంటియానక్ సుల్తాన్ రిపబ్లిక్ ప్రభుత్వంలో మంత్రిగా ఉండి, వెస్టర్లింగ్ సహాయంతో దేశరక్షణశాఖా మంత్రియైన జోగ్జకర్తా సుల్తాన్నీ, ఇద్దరు ఉన్నత సైనికాధికారుల్నీ హత్యచెయ్యడానికీ రిపబ్లిక్ మంత్రులందర్నీ అరెస్టు చెయ్యడానికి పన్నిన కుట్ర బయటపడింది. వెంటనే జోగ్జకర్తా ప్రభుత్వం మంత్రి పాంటియానక్ సుల్తాన్‌ను అరెస్టుచేసింది.

తూర్పు ఇండొనీషియాకు కేంద్రప్రభుత్వం తమ సైన్యాలను పంపాలని నిశ్చయించగానే, ముందుగా రాయబారాలు నడపాలని తూర్పుఇండొనీషియా ప్రభుత్వం కోరింది. ఫెడరల్ సైన్యాల్ని నిలవరించడానికి అభ్యంతర పెట్టకూడదనీ, రాజ్యాంగ విషయాలపైన రాయబారాలు జరుపవచ్చుననీ రిపబ్లిక్ ప్రభుత్వం సమాధాన మిచ్చింది. దీనికి తూర్పుఇండొనీషియా ప్రభుత్వం అంగీకరించింది. రెండువేలమంది ఫెడరల్ సైనికులు ఓడల్లో తూర్పుఇండొనీషియా పంపబడ్డారు. ఇండొనీషియా ప్రధాని ఇండొనీషియా రాజధానియైన జాకర్తాకు వచ్చి రాయబారాలు సాగిస్తున్న సమయంలో, తన క్రిందనున్న 600 మంది డచ్చి ఇండొనీషియన్ సైనికుల బలంతో కెప్టెన్ అజీజ్ తిరుగుబాటు చేసి తూర్పు ఇండొనీషియా ప్రధాననగరమైన మెకస్సార్‌ను స్వాధీనం చేసుకున్నాడు. ఈ తిరుగుబాటులో స్థానికపోలీసు బలం సహాయపడింది. మెకస్సార్‌లో ఉన్న 200 ఫెడరల్ సైన్యాన్ని నిరాయుధుల్ని చేసి, వారిని వారివారి నివాసాలలో నిర్బంధించారు. ఓడల్లో వచ్చిన ఫెడరల్ సైనికులు ఒడ్డెక్కితే యుద్ధం తప్పదని అజీజ్ బెదిరించాడు. మెకస్సార్‌లోని ఫెడరల్ సైనికాధిపతి మొకొగింటోను కూడా నిర్బంధంలో ఉంచాడు. తూర్పుఇండొనీషియా అంతటా ఉన్న డచ్చిఇండొనీషియన్ సైన్యం బలం నాలుగువేలుంటుంది. వీరికి మెకస్సార్‌లోని 200 మంది ఫెడరల్ సైనికులూ తోడైతే తిరుగుబాటును అణచడం కష్టమయేదే. కాని డచ్చి ఇండొనీషియన్ సైన్యదళాలు సెలిబస్ ద్వీపంలో చెల్లాచెదరుగా ఉన్నందువల్ల ప్రమాదం సంభవించలేదు. పోగా మెకస్సార్‌లోని 200 మంది ఫెడరల్ సైనికులూ వాస్తవానికి తిరుగుబాటుదార్లని అణచలేదనీ, తిరుగుబాటుదార్లకు ఆయుధాలు ఒప్పగించి ఊరుకున్నారనీ ఇండొనీషియన్ ప్రభుత్వానికి తెలియవచ్చింది. సెలిబిస్‌కు పంపబడిన సైన్యాలు ద్వీపంలో దిగి తిరుగుబాటుదార్లని అణచాలని రిపబ్లిక్ అధ్యక్షుడు సుకర్నో ఉత్తరువు చేశాడు. కెప్టెన్ అజీజ్‌ను స్వయంగా జాకర్తా వచ్చి, తన అవిధేయతకు సంజాయిషీ చెప్పుకోవాలని ఉత్తరువు చేశాడు. తూర్పుఇండొనీషియా ప్రభుత్వం తనపోలీసు దళాన్ని ప్రయోగించి తిరుగుబాటుదార్లని అణచాలని కూడా ఆ ప్రభుత్వానికి ఆజ్ఞ ఇచ్చాడు. పరిస్థితి విషమించడం గమనించి, తూర్పుఇండొనీషియా అధ్యక్షుడు సుకవతి స్థానిక ఫెడరల్ సైనికాధికారి మొకొగింటోతోనూ, అజీజ్‌తోనూ సంప్రదింపులు జరిపాడు. సుకర్నో నిర్ణయించిన కాలవ్యవధికి ఎనిమిదిగంటలు ఆలస్యంగా అజీజ్ లొంగుబాటును ప్రకటించాడు. తాను జాకర్తా వచ్చి సంజాయిషీ ఇస్తే ప్రభుత్వం అరెస్టు చేయరాదని షరతు పెట్టాడు. ఈ షరతుకు మొకొగింటో అంగీకరించి అజీజ్‌ను పంపాడు. కాని రిపబ్లిక్ ప్రభుత్వం షరతును అంగీకరించలేదు. సరిగదా అజీజ్‌ను సైనికశాసనం ప్రకారం విచారించి శిక్షించగలదనికూడా ప్రకటించింది. అజీజ్ జాకర్తా చేరగానే అతన్ని ప్రభుత్వం అరెస్టుచేసింది. ఫెడరల్ సైన్యాలు సెలిబిస్‌ద్వీపంలో దిగి మెకస్సార్ నగరం వెళ్ళాయి. అక్కడ అజీజ్ సైన్యాలను నిరాయుధం చేశారు. మెకస్సార్‌లో ఉన్న ఫెడరల్ సైన్యం కర్తవ్యం పాలించకుండా తిరుగుబాటులో ఉపేక్షించినందుకుగాను, ఆ సైనికాధికారి మొకొగింటోను సుకర్నో ఆజ్ఞప్రకారం తూర్పుఇండొనీషియా పోలీసులు అరెస్టు చేశారు. దీనితో తిరుగుబాటుబండారం బయటపడింది. జాకర్తాలో తూర్పుఇండొనీషియా ప్రధాని రిపబ్లిక్ ప్రభుత్వంతో రాజ్యాంగసమస్యల్ని పరిష్కరించడానికి సమాలోచనలు జరుపుతున్నాడు.

ఈ రెండు తిరుగుబాటులతోనూ ఇండొనీషియాలో జాతీయప్రభుత్వప్రాబల్యం ప్రపంచానికి వ్యక్తమయింది. ఇండొనీషియాలో సుకర్నో ప్రభుత్వం తన అధికారాన్ని స్థిరపరుచుకోలేకపోతున్నదనీ, అక్కడ అరాచకం అంతర్యుద్ధాలు చెలరేగుతున్నవనీ అమెరికన్ యూరోపియన్ పత్రికల్లో జరిగిన ప్రచారమంతా బూటకమని తేలిపోయింది. జాతీయప్రభుత్వం బలీయంగా ఉన్నదని తెలిసే అమెరికా ఋణమివ్వగలిగింది. లేనిచోట అరాచకం రేచ్చగొట్టాలని యత్నించిన యూరోపియన్ తంత్రజ్ఞుల కుట్రలు విఫలమైనాయి.

ఇకపైన సుస్థిరమైన రాజ్యాంగాన్ని స్థాపించడానికి ఇండొనీషియన్ రిపబ్లిక్ కృషిచేస్తుందని ఇటీవల ఇండొనీషియన్ విదేశాంగప్రతినిధి పాలార్ ఢిల్లీలో ప్రకటించాడు. భారతదేశంలోవలెనే ఇండొనీషియాలో కూడా స్థానికస్వపరిపాలనకంటె బలీయమైన కేంద్రప్రభుత్వస్థాపన ఆవసరమని వారి అభిప్రాయం. 1950 డిసెంబర్‌లోగా ఇండొనీషియన్ రాజ్యాంగ నిర్ణయపరిషత్సభకు ఎన్నికలు జరుగుతాయని డా॥ పాలార్ చెప్పాడు. భారతదేశం వలెనే, న్యూగినీసమస్యమినహా తదితర జాతీయ రాజకీయ సమస్యల్ని ఇండొనీషియా పరిష్కరించగలిగింది. ఇండొనీషియాలో కూడా జాతీయైక్యత లభ్యమయింది.

[సూర్యనారాయణ]



సాలూరు తాలూకా చేనేత పారిశ్రామిక మహాసభ సందర్భపు ఫోటో సాలూరు పంచాయితీబోర్డు ప్రెసిడెంటు అల్లుఎరుకనాయుడు, కెల్లక మల్లిస్వామి, రొబ్బ యల్లయ్య, పట్టణ కాంగ్రెసు అధ్యక్షుడు కూనిశెట్టి వెంకటనారాయణదొర, ఆకాశపు గవరయ్య, చిట్లు గోపాలంగార్లు వరుసగా కుర్చీలలో కూర్చున్నారు

## వార్తా చిత్రాలు

గోపాలపురంలోని మద్రాసు సంగీతకళాశాల వార్షికోత్సవం. ఈ సంస్థను శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారి కుమార్తె స్థాపించా..

Regd. No. M. 4479

# శ్రీమద్భగవద్గీత

వ్యాఖ్యాత: శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారు



ఐదవ ముద్రణము

సంస్కృతమూలము, తెలుగున టీకాతాత్పర్య విశేషార్థ వివరణములు గల 400 పుటల గ్రంథము. గీతాధ్యయనపరులకు మిక్కిలి ఉపయుక్తమైనది.

ఖద్దరు బైండు

**వెల రు 4-0-0 లు.**

రవాణాఖర్చు రు. 0-9-0.

పోస్టుబాక్సు 212, ఆంధ్ర గ్రంథమాల, మదరాసు 1.

---



గాంధీమహాత్ముని

# ఆత్మకథ

ప్రథమ, ద్వితీయ సంపుటములు

[చతుర్థ ముద్రణము]

తాపధాని వేలూరి శివరామశాస్త్రిగారి అనువాదము

ద్వితీయ సంపుటము తయారై ఉన్నది. త్వరపడుడు

ఖద్దరు బైండు

ప్రతి సంపుటము పోస్టేజితో సహా వెల రూ. **5-9-0**

ఒకేసారి 2 సంపుటములు పోస్టేజితో రు. **10-12-0**

Edited, Printed & Published by S Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras.